సంగీత

# జయంతజయపాలము.



పబ్లిషర్సు

కర్రా అచ్చయ్యా అండు సన్సు

బుక్సెల్లర్సు

రాజమహేంద్రవరము.

యెనిమిదవకూర్పు 1500 ప్రతులు

శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1927

వెల రు. 0—8—0

# సంగీత జయంత జయపాలము.



(ఐదంకముల నాటకము)



కర్రా అచ్చయ్య అండు సన్సు

బుక్ సెల్లర్సు & పబ్లిషర్సు.

రాజమండ్రి.

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రా జ మ ం డ్రి.

1927



(వెల 0—8—0)

## ఈ నాటకమున వచ్చు పాత్రలు.

### పురుషులు.

జయంతుఁడు—కళ్యాణపురాధీశ్వరుని కుమారుఁడు

జయపాలుఁడు—జయంతుని మిత్రుఁడు

చిత్రకేతుఁడు—పాంచాలపురాధీశ్వరుఁడు

వీరసేనుఁడు—చిత్రకేతుని కుమారుఁడు

జయవర్మ—చిత్రకేతుని మంత్రి

వెంకఁడు—ప్రభావతియొక్క విటకాఁడు

### స్త్రీలు.

చారుమతి—జయపాలుని భార్య

నర్మద—చారుమతి చెలికత్తె

ప్రభావతి—జయంతుని భార్య

మోహిని—కళ్యాణపురమున నున్న వేశ్య





# సంగీత జయంత జయపాలము.



నాంది

చ. సుమతులఁ బుణ్యమూర్తులను సూనృతవాదుల దేశభక్తులన్
విమతుల సత్కృపాకరుల ♦ వేడ్కలరారఁగ నెప్డు బ్రోచుచున్
కుమతుల శిక్ష సేయుచు న ♦ కుంఠితలీల జగంబునేలు శ్రీ
రమణుఁడు సర్వసద్గుణ వి ♦ రాజితుఁ డేలునుగాక సభ్యులన్.

సూత్రి—(నాంద్యంతమున) అతివిస్తరంబేల? నటీ? నీయలంకారము పూర్తియైనచో నొకసారి యిటురమ్ము.

నటి—(ప్రవేశించి) నాథా! వచ్చితిని. నగలు శృంగారించుకొనుటలో నొక్కింత యాలస్యమైనది. క్షమింపుఁడు.

సూత్రి— నీకును నీ పిచ్చిపట్టెఁదా. ఆహా కాంతలెంత యజ్ఞానాబ్ధిలోఁ బడుచుంటిరి?

నటి—నాథా! నాయజ్ఞానంబుఁ గాఁగ్రహింపకుఁడు.

సూత్రి—రమణీమణీ! నిన్ననలేదు. ఈకలికాలంబునఁగాంతలెట్లుండిరో తెలియును గదా.

సీ. బొట్టు మోటంచును ♦ బొట్టు పట్టుటమాను
భామామణుల్ కడు బ్రబలినారు
పతిసేవ విడనాడి ♦ పరపురుషుని జేరు
పూబోఁడులెందరో ♦ పుట్టినారు
మానాభిమానంబు ♦ బూఁకెంతేని సం
సారులే దొమ్మః ♦ నాసులైం
పరపూరుషునిజేరఁ ♦ బ్రాణేశ్వరుని జంపు
బింబోష్ఠులెందఱో ♦ వెలసినారు

తే. గీ. గరిత లెంతకైనను జాల • గలరు సుమ్మి
రేమి చెప్పుదు మఱియింక నెన్నికలవొ
వారి భావంబు దెలియంగ • వశముగాదు
కామినీ! యిదియాతియు • గాలమహిమ.

నటి—మీరెప్పుడును నేదోతీరుగ నిట్లు పలుకుచునేయుందురు. దీనికేమిగాని ప్రస్తుతకార్యము సెలవీయగోరెద.

సూత్ర—రమణీ! ఈసభ్యులు మన నాటక ప్రదర్శనంబునకై చాతకంబులు మేఘంబునకై యెదురుచూచు భంగి వేచియున్నారు.

నటి—ఏనాటకంబును ప్రదర్శింప దలంచిరి?

సూత్ర—జయంతజయపాలమను నొక నూతన నాటకంబు.

నటి— తెలిసినది. ఇంతేకదా యొకరాజకుమారి విటకానిపై ప్రేమచే భర్తను జంపును.

సూత్ర—అవును.

నటి—మనోహరా! గ్రంథకర్తనామం బెద్ది యూవచించిరికారు.

సూత్ర—పేరుతో నవసరమేమున్నది?

చ. కవియెవరోయటంచునను • గంగ్రబయోజనమేమియున్నదో
కవలవలెఁ జరించుచు జ • గంబున ఖ్యాతిని జెందుచున్న స
త్కవులకు భక్తిమీరగ ము • దంబున సేవనుజేసి భూమిలోఁ
గవనమునల్ల నేర్చిన య • ఖండమనీషి రచించె సుందరీ.

నటి—మీరెంత గూఢార్థంబుగఁజెప్పినను నేగనుగొంటి. ఇంక మనమేఁగి ప్రదర్శనంబునకుఁ దగిన ప్రయత్నంబుజేయుదము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

—):o:(—






ప్రథమాంకము.



[ఉద్యానవనము:—జయంతుడు, జయపాలుడు ప్రవేశించుచున్నారు.]

(1) సాంగు—జయపాలుడు ప్రమదావన వర్ణనము.

బేహాగ్ రాగము—రూపకము.

ఈప్రమదావనం బతియామోదంబై । డెందంబును చిగురించు
చు నున్నది॥

ఈశుకపికశారి కాగతికామనోహరంబు । సంఫుల్లప్రసవ సుగంధ
బంధురంబై । సకలాహ్లాదకరంబై సంతోషము గొల్పుచుండె।
నీప్రమదావనంబతి॥

అల్లిబిల్లిగనల్లి । వల్లరులనికుంజములను । నల్లలితామోదంబు
న । సఖులగూడివిహరింపరే॥ యీప్రమదావనం॥

జయం—సీ. కుసుమాలిమకరంద ♦ రసపానమత్తచి

త్తతచరించెడు షట్ప ♦ దప్రకరము

ఎలమావి చిగురుల ♦ నింపార భక్షించు

పికరాజసత్కుల ♦ విలసితంబు

జలధరదర్శనో ♦ త్సాహనిపరీక్షణ

బర్హబర్హిన్నికాయ ♦ పాటవంబు

పలువిధభూరుహ ♦ ఫలభార భక్షిత

సంచారశారికా ♦ సముదయంబు

తే. గీ. గలిగి వివిధచిత్రగతులఁ ♦ జెలఁగుచుండు
నివ్వనంబు నిప్పుడో ♦ క్ష్మాంతకాల
మాగి విహరించి మదికి సౌ ♦ ఖ్యంబు గూర్చు
కొందమో ప్రాణహితుఁడ యా ♦ నంద మెసఁగ.

జయపా—మిత్రమా !

తే. గీ. కుసుమఫలవితానంబులు ♦ కొమరుమిగిలె
నందనోద్యానమనఁగ నా ♦ నంద మొదవె
నిందువిహరించి కడుసుఖ ♦ యించి పదప
గృహముఁజేరంగఁబోదము ♦ కీర్తిఁ బొంద.

జయం—మిత్రమా ! నీయిచ్ఛవచ్చినట్లాచరింతము. అదిగో ఆకాసారంబునకేఁగి యచ్చట నొకింతవిశ్రమించివృక్షంబులనుండివచ్చు మందమారుత సౌఖ్యంబును గాంచుదము. (కాసారముజేరుచున్నారు)

జయపా—మిత్రమా ! స్నేహమునకు మించినపవిత్రమైనవస్తు వీజగంబున లేదుగదా ! అందుమనమిత్రత్వమునుగురించి నుడువఁ దరంబుగాదు. మన మైత్రికి భంగముగలిగింప మనజనకులెంతయో ప్రయత్నముచేసిరికదా. దానఁ బ్రయోజనంబేమియులేదు.

జయం—సఖా ! ఇట్టిది యొకరివలన నగుకార్యముగాదు. మన మైత్రిని బురహరుఁడువచ్చి బాపవలెనని ప్రయత్నించినను బాయువారము కాము. ఇది యాచంద్రతారకంబుగ వెలుగునదే. నీమనంబున నెట్లున్నదో మాత్రము నాకుఁ దెలియదు.

జయపా—తే. గీ. కులిముపోనిమ్ము కడగండ్ల ♦ గుడువనిమ్ము
అగ్ని చల్లబడగనిమ్ము ♦ నష్టెనింక
నిమ్ము జనకుండ దూషింప ♦ నిమ్ము నీదు
మైత్రివీడంగఁ దలఁపను ♦ మాన్యచరిత.

జయం—అదియే నాను గావలసినది.

[తెరలోఁ బాట వినిపించుచున్నది.]

జయం—ఆ మృదుతర కంఠస్వరం బెవ్వరిదో చూచితివా? ఏమిగానము !

సీ. వాణీమహాసతి ♦ వాయించువీణార
వం బిదియంచుభా ♦ వనమునఁదోప
సంగీతరసమిట్లు ♦ గంగాప్రవాహమై
బాఱుచుండెనటంచు ♦ మదికిదోప
హరిభక్తి యీరీతి ♦ సవత్కారమెత్తెనా
యనగ వినెడివారి ♦ కాత్మఁదోప
కోకిలారవమిద్ది ♦ ప్రాకటంబుగనంచు
చిత్తంబునందు న ♦ చ్చెరువుబుట్ట
తే. గీ. సరసమై తనరెడి తన ♦ సర్వమునెత్తి
పాటఁబాడుచు నిప్పుడీ ♦ బాటవచ్చు
చుండె గాంచినావె ! మిగుల ♦ చోద్యముగను
సుందముల కెక్కుడైయె యుప్పు ♦ మందయాన

[పరికించి] అదిగో ! పాటబాడుటయే కాదు.

చం. అంగుళులు మెల్లగాదిడుచు ♦ నట్టిట్టుజూచుచు నోరచూపు సొం
పడర; పరీక్షసేయుచున ♦ భవ్యవనంబును ; పాటఁబాడుచున్
బడివడిఁ బూలగోయుచు సు ♦ పర్వసతీమణి సుందరత్వమున్
లలి బురిడింగాదగిన ♦ నాతిని జూచితివే హితోత్తమా.

తే. గీ. తరుణశారీర సౌందర్య ♦ తతులు వనము
నెల్లెడల నాక్రమించి యీ ♦ ప్రాంతశోభ
గలుగఁజేయుచునుండెనో ♦ కాంచినావె
దివ్యలావణ్యసీమ న ♦ తీలామ !

(మోహిని ప్రవేశించుచున్నది)

మోహి—[స్వగతము]

(2) సాంగు—మోహిని. జంఝూటిరాగము. త్రిశ్రజాతి

1 నాసారిమాయదారి । నాసాటితంత్రకారి । కాంచినారెభువిని కామినులయందు మీరు !

లేనిపోనిపేమచూపి । మానవునబంధవైచి । మానధనమెల్లగొని । మసిబూసిపంపుదాఁ ॥ నాసారిమాయదారి॥

2 తంత్రములబన్ని మైత్రి । తలగజేసిచింతమంచు॥ సూత్రమును బట్టినాను । చూడుడయ్య నామహిమ॥ నాసారిమాయ॥

సీ. మాయమంత్రము బన్ని ♦ మహిలిగుణాఢ్యులఁ
జెచ్చెర వశులుగా ♦ జేయుదాన
పటువేషముచుబూని ♦ విటకాండ్ర వంచించి
ధనమునెంతైనఁ దై ♦ కొనెదుదాఁ
పేసట్టిపోరుగ ♦ ల్పించి జగాల్ మెచ్చఁ
బలిసతులను నెడ ♦ బాపుదాన
గల్లప్రేమలజూపి ♦ కాంక్షదీరంగను
జేసెద జారుల ♦ సేవకులుగ

తే. గీ. నిదియునదియంను లేఁదిక ♦ నెన్నినైనఁ
చేయఁగాఁగల సతతంబు ♦ చెలువుమీర
తోడివేశ్యలు నన్ను సంతోషభావ
మూనిసేవించు చుండగ ♦ నుర్వియందు.

మహారాజగారు నన్నుబిలపించి జయంత జయపాలురమైత్రికి లెట్లయిన భంగముగలిగింపుమని యాజ్ఞతిచ్చిరికదా. ఇప్పుడా కార్యబు నందునే నేమరక ప్రవర్తింపవలెను. (జయంత జయపాలురఁ జూచి) ఇరుగో వారిక్కడనే తటస్థించినారు.

జయం—(మోహినినిజూచి) మిత్రమా ! తరుణీమణి నిప్పుడు కలవుదీరఁజూడవచ్చును జూడుము.

చ. కమలభవుండు వేడ్కఁజిర ♦ కాలము ఘోరతపంబుజేసి, యీ
కమలముఖిన్ సృజించెనటు ♦ గానియెడన్ మదినెంచిచూడఁగా
విమలమృదుత్వమున్సొగసు ♦ వేడ్కలునిండిచెచూపుగోపులున్
సుమహితనేహసౌష్ఠవము ♦ శోభిలుచెట్టులు పాణిమిత్రమా.

భళిరా ! ఈయిందుముఖి సుందరవదనారవింద సందర్శనంబున, జేసి నాజన్మము పావనంబైనది. ఇట్టి తరుణీశిరోమణిం గూడని నాజన్మ మేల? సఖా ! ఈమెయెవ్వరో యరయుదమా ?

జయపాల—అరయనవసరములేదు. ఇది మన పురంబుననుండు వేశ్యయే.

జయం—అట్లయినచో నేఁటిరేయి దీనిగృహంబునకు మనము బోవచ్చును.

జయపా—

చ. హరహర యెంతమాట హితు ♦ డాయిటులాడగ నెట్లుతోఁచెనో
పరవనితన్ రమించుటను భావ్యమె శ్రేయముసంప్రదాయ మే
స్థిరతర కీర్తిపోవగద ♦ చెల్వుగనవ్వరె చూచువారలన్
నిరతము మానసంబునను ♦ నితరనేత్రములుగుందుచుండదే.

జయం—నీవని నట్లిమె పరవనిత కాదుకదా. వేశ్యయేకదా. కావున నేఁటిరేయి నాకోరికం దీర్చికొందు.

జయపా—మిత్రమా !

తే. గీ. ఎవఁడు ధనమిాయ నాతఁడే ♦ ధవుడటంచు
వలపుఁ జూపించుచుండి దర్ ♦ వ్యంబు గొంచు
రెవుడు నిజమైనప్రేమలే ♦ దింతమైన
మాయలకు లంజలకొలంబు ♦ మాతృగృహము.

తే. గీ. ధనమునిచ్చినవెపుడు ము ♦ దంబుగూర్చు
ధనమునీయంగలేకున్న ♦ దరలఁజేయు
కంచుకాగడఁ వెదకిన ♦ గరుణలేదు
వివిధ కుగుణగణోపేత ♦ వేశ్యమాత.

వేశ్యాంగనలపొందు హేయభాజనంబని నీకుమాత్రము తెలియదా ? తెలిసియుండియు నిట్లుల యజ్ఞానాబ్ధిలోఁ బడెదవు.

జయ—సఖా ! అనేకమందయానలఁ దిలకించితినిగాని యీయందచందంబులుగల సుందరదన నెందును వీక్షించియుండ లేదు. ఇకాంతామణింజూచినయంతనే మారుండు నాపై శరంబులఁ బఱుపసాగెను.

జయపా—పెద్దలచే హేయంబుగఁ జూడఁబడుచున్న యీవేశ్య పొందు నభిలషించుచున్న నిన్నేమని వారింపఁగలను. చాలుఁజాలు. ఇంక నీవాసంగతిగట్టిపెట్టుము.

మోహిని—(స్వగతము) అదుగో! రాజకుమారుండును దతని సఖుండును నేదియో సంభాషించుచున్నారు. ఇప్పుడు నేనొక చిత్రమును జేసి యాపిదప నేమగునో యీప్రాంతంబునందుండి వీక్షించెదను. (మంత్రికుమారుం జూచి చేసైగఁజేయుచున్నది.)

జయం—మిత్రమా ! నిన్నేటికో యవ్వారాంగన పిలుచుచున్నది. ఒక్కసారి బోయిరమ్ము.

జయపా—(వేశ్యను సమీపించుచున్నాఁడు)

మోహి—[మంత్రికుమారుంజూచి] మంత్రికుమారా! వచ్చితివా ? ఇటుఁరమ్ము నీకొకరహస్యంబుజెప్పెదను. [అనిచెవిలోనేదియో చెప్పి నిష్క్రమించుచున్నది.]

జయపా—ఛీ! కులటా ! అఁడుదానవు కాఁబట్టి బ్రతికిపోతివి [అని జయంతుని సమీపించుచున్నాఁడు.]

జయం—(జయపాలు నవలోకించి) సఖా! నిన్నా వారాంగన యెందులకుం బిల్చె?

జయపా—ఏమియులేదు. ఏదోరహస్యము చెప్పెదనని చెవిలో "వడ్లగింజలో బియ్యపుగింజ" యని పలికి తం దారిని బోయెను.

జయం—ఏమి! అట్లని చెప్పిపోయెనుగా! వంచనజేయుపలుకు లెప్పుడు నేర్చుకొంటివి?

(౩) పాంగు—జయంతజయపాలురద్వైలాగు- మోహా-రూపకము

1 జయపా॥ దైవసాక్షినామాటయదార్థమునుమినమ్ముమిా॥దైవసా। ఈవేశ్యలమాయమట । లిట్లేమోసగించుమిా॥దైవసా॥

2 జయంతు॥ చాలుచాలుచలువుడవని।చాలమోసపోయితి,చాలు పిలచివడ్లగింజలోని బియ్యమందు జెప్పనా ॥చాలుచాలు॥

3 జయపా॥ అనృతమాడు వాడగాను। అంలసాక్షిగానేను।మనసు కలతపరచిమనల। మైత్రిచెరుప । జెప్పనా॥ దైవసాక్షి॥

4 జయం॥ నాకుదెలుపనిచ్చలేక - సాకుపన్నినావుగా- ఠాకులునా దుచెల్మికిని చి - రాకుగల్గెనాకిక॥చాలుచాలు॥

జయపా—నీపాదసాక్షిగ నిక్కంబుబల్కితిని. ఇందసత్యమెంత మాత్రమునులేదు. అనుంగుసఖా! నాసంగతి నీవెఱింగియు నిట్టుల పల్కెదవు;

జయ—ఒరీ। జడమతీ! నీసంగతినెఱుంగక మోసపోతిని.ఆహా! ఎకత టక్కుటమారవిద్యలునేర్చితివి? నేనభిలషించిన యారమణింగూడ దలంచి యాకాంతతో నేద్దిమోసంభాషించి నాయొద్దననృతంబులు బల్కుచుంటివా?

తే. గీ. బాల్యమిత్రుడవంచు నా ♦ భావమందు
దలంచితినిగాని యీరీతి ♦ దలంపలేదు

భళిర గనుగొంటినేఁడు నీ ♦ మైత్రిమహిమ
చాలుఁజాలింక నిదె నమ ♦ స్కారమయ్య.

జయపా—(తనలో) అక్కటా ! ఆటక్కులాడియెంతగార్యంబు చేసెను? ఎన్నఁడును నాయందు నింపరేయని ప్రాణసఖుండు నేఁడిట్లు బలుకసాగెను. ఇప్పుడేమి చెప్పుదును; (ప్రకాశముగా)

ఉ. తల్లినిగోరినట్లునుమి ♦ తథ్యముబల్కుచు నుంటినిప్పుడు
త్ఫుల్లసరోజనేత్రిరతి ♦ బొందఁదలంచిన వాఁడనేని నా
యుల్ల మసత్యమున్ బలుక ♦ నొప్పదు నీకడ, నీవెఱుంగవే
సల్లలిత ప్రతాపగుణ ♦ సారగ నీవిటులాడఁ బాడియే?

జయం—ఈమాటల కేమిలెమ్ము. ఎంతటివారైనను నిట్టి సమయంబులం దస్తృంతింబులాడె దీరుదురు. ఆహా ! చిన్నతనంబునుండియు నిన్నునమ్మి మోసపోతిని.

తే. గీ. పామునకుఁ బాలువోయుచు ♦ భవ్యమతిని
పెంచి పెద్దదానిగఁజేయ ♦ వంచితముగఁ
గరుణబూనక కఱచెడి ♦ కరణిగాఁగఁ
నొప్పుచున్నది నీనేస్త ♦ ముర్వియందు.

జయపా—(తనలో) ఆహా ! ఇప్పుడేమందు అయ్యో! ప్రాణపదంబగు సఖుండును నన్ను నిష్కారణంబుగ నిందించుచున్నాఁడు కట్టా ఏమిచేయుదును? (ప్రకాశముగా)

తే. గీ. లేదు నాయందు దోషంబు లేదు లేదు
ఎపుడు మోసంబుచేయంగ ♦ నెంతలేదు
అనృతమాడంగఁ దలఁపలే ♦ దాత్మయందుఁ
గరుణఁ జేపట్టి రక్షింపు ♦ వరసఖుండ.

మిత్రమా ! బాల్యంబాదిగా నెన్నఁడును నీతోనసత్యమాడకనాప్రాణములకన్న నిన్నెక్కుడుగఁ బ్రేమించుచు సంసారముననైనను సరకుగొనక నీతోడిదెలోకంబని చరించుచున్న ననీరీతింబలుక న్యాయమా ?

జయం—చాలుఁజాలు. ఇంకననవసరప్రసంగము చేయఁబోకుము

ఉ. చాలునుజాలు స్నేహితపు ♦ సంగతులన్ గనుగొంటి జక్కఁగా
బేలతనంబుబూని యవి ♦ వేఁడవై చరియించినాఁడ నీ
లీలను మైత్రి; చిత్రముగు ♦ లీల వంచనచేతువంచు నో
బాలిశ! యెంచలేదెపుడు ♦ భావమునందుఁ జేయునేటికిన్.

ఇంక మారుపలుకక గృహంబునకుఁబొమ్ము. నామిత్రత్వమును నేటి నుండి మఱచిపొమ్ము.

జయపా—సఖా! ఎంతకర్ణకఠోరములగు పల్కులఁబల్కుచుంటివి

మ. అకటా! నన్నిటులాడ బాడియగునా ♦ హా! మిత్ర! యేమందు? న
య్యకలంకాత్ముని పాదసాక్షిగను నా♦యందెప్డు దోషంబు లే
దొకయింతేనియుఁ జెల్లునే యిటులుకో ♦ పోద్యోగముంబూనఁగా
నిఁక నేదేడకుఁబోదు దిక్కెవరు నీ ♦ చేకాకా భూమండలిన్.

జయం.—మ. బ్రతిమాలన్ బనిలేనులేదు వినుమా♦పల్మాటలింకేల ని
శ్చితమున్ దెల్పితినీదుస్నేహమిఁకగాం ♦ క్షింపంగఁ జిత్తంబు, న
మ్మతినిం బూనదికేమిచేసెదను బో ♦ మ్మా నేఁగ నన్వీడి, సు
స్థితసౌఖ్యంబును జెందు వారవనితన్ ♦ జెల్వొందగాఁగూడుచున్

జయపా—హరహరా! ఎట్టిమాటలాడుచుంటివి నిన్నుబాసినే నెందుబోగలను. మిత్ర · మనంబుబరిశోధించుటకిట్టులాడుచుంటివా లేక నాకర్మఫలం బిట్టులుండెనా. నిన్ను విడనాడి త్రుటికాలంబైనను జీవంబులతో మనగలనా; నీవిషయమై నేనెప్పుడును ద్రోహంబు దలపలేదు. అట్టిదేదైన నుండెనేని గరుణింపుము.

జయం—[స్వగతము] ఈదుర్మార్గుడునన్నిదివఱకెంత మోసము చేసినాడో ఈతనిస్నేహంబున మఱగి నేను సంసారసుఖంబులుగూడ మఱచియుంటిని. ఇంకనేను నేటిదినంబున మామతండ్రిగారిసెలవుగైకొని మాయత్తవారిటికేఁగి జాయందిలకించెద.

జయపా—స్నేహితుడా! నాప్రార్థనమంగీకరింపవా.

జయం—ఇంకనీవాసంగతి దలపెట్టకుము[అనినిష్క్రమించును

[4] సాంగు జయపాలుడు ఫీల్వారాగము—ఆదితాళము.

1 ఎంతచేసెనీవేశ్యహా । మంతనముసమామైత్రిచెరచెనయ్యో॥ఎం
పిలచినప్లగిండలోనన్నున్నది । బియ్యపుగిండనిచలికె। నా చెలువుడి
ట్టిమాటనమ్మకెంతయు। నలిగినన్నులోండచె। యీయలఘుచిం
తనెట్టుదాటిబ్రతుకుదు। నవనిలోన హాశౌరి।గిరిధారి యేవారి
దనుజారి॥ ఎంతచేసె నీవేశ్య॥

2 ధరణిలోనవేశ్యకాంతలెంతటి। తంత్రిమైనన్నునుకు-శరధివాని
చేట చెరగనేర్తురువిరతురావమోక్రకాల- యీసరసిజాండముబం
తులట్లకొని చక్కగనాడెదువారు-మనసిరు ధననారు- లింవా
రీ॥ యంతచేసెవేశ్య॥ యెంతచేసె॥

జయపా—అక్కటక్కటా ! ఆమాయలాడి యెంతచేసెనదిదా
నిమూలంబునఁగదా నూస్నేహము భంగమైనది. అయ్యయ్యో! తృటి
కాలంబైనను నన్ను బాసి యెరుంగనిమిత్రుండు నన్నుఁబాసెహా! దై
వమా! నాకిట్టిచింతగూర్ప నీకు న్యాయమా. (యించుకయూరకుండి)
స్నేహంబునకుమించినవస్తువుమరియొకండులేదుకదా. ప్రాణమిత్రుండగు
జయంతుఁడేనామైత్రి వలదని నిరాకరించినప్పుడు నేనీపురంబునుండ
నేల? సన్యాసివేషంబు ధరియించి నాయిచ్ఛవచ్చినస్థలంబులందుఁ జరిం
చుచుఁ గాలంబు గడపెదను. [నిష్క్రమించుచున్నాడు]

[వెంటనేమోహిని ప్రవేశించుచున్నది.]

మోహిని—[స్వగతము] నాతంత్రము బాగుగా ఫలించినది
వీరిరువురిమైత్రికిని భంగముకలిగినది. అవును. భంగము కలుగ కేమ
గును. నేనుచేపట్టినకార్యము మరియొకతీరున జరుగునా. ఇంక నేనీసం
గతి రాజుగారికిం దెలిపి బహుమతిం గొనియెద.

[నిష్క్రమించుచున్నది.]



# సంగీత జయంత జయపాలము.



ద్వితీయాంకము.



పాంచాలపురము.

(ప్రభావతి సౌధము)

(5) సాంకు—జయపాలుడు-కళ్యాణిరాగము-రూపకము

1 పాలనీళ్ళబోలుచెల్మి -పాడువడెనుగా॥ దైవవిధిని॥ పాల॥ఎలబ్ర
తుకుసఖునిబాసి - యెందుజొచ్చెదా॥ కష్టైనగుచు ॥పాల॥

2 మాయదారి పాడువేశ్య - మాటసెల్లెగా మాయెడలను॥మా
మాయవనీపతిపుత్రుడు - దాయయయ్యెగా ॥ఏమిసేతు॥పాల

జయపా—(సన్యాసివేషముతో, బ్రవేశించి) ఆహా కాలమం
తయు నొకతీరునఁగడప నెవ్వరికినిఁ దరంబుకాదుగదా. తృటిలోనేమి
సంభవించునో యెవ్వఁడు నెఱుఁగలేడు. బాల్యంబునుండియు నేస్నఁడు
ను నెడఁబాయని మామిత్రత్వముఁకుభంగముగలిగినది. అహా మిత్రు
నిపైఁ బ్రేమ యెంతచేసినది. సన్యాసివేషముగూడ వేయించినది(పలికిం
చి)ఇదియేకదా. నామిత్రుడగు జయంతుని భార్యగృహము. అతని
పైనుండు ప్రేమను వీడలేక యత్తవారింటి కరుదెంచునతని కెరుకలే
కుండ వెంటబడి వచ్చితిని. ఇప్పుడు నేనేమిసేయుదు ? (ఇంచుకయూ
రకుండి)చేయుటకేమున్నది. ఈయరఁగుపై బరుండెదను(అనిపండుకొని)

మ. సతతంబుఁ ఘనమైత్రి పెంపెసఁగ మేల్ ♦ శయ్యాతలంబందునా
క్షితిపాలాత్మజుతోడఁ బండుకొనుచుఁ ♦ జెల్వొంది నేనిప్పు డా

హితుడై ప్రేమనువీడలేక యకటా ♦ యూత్మస్నేహపై బండితీ
స్థితికేమందుజెప్పగా దగమొకో ♦ స్నేహానుబంధనంబునన్.

యెన్నటికైనను స్నేహితునితో గలసిసంభాషించు భాగ్యం బబ్బునా, ఆభాగ్యంబులేకపోయినను నాతని ముఖకమలసందర్శనంబుచే తనైనను నామనస్తాప మెకింత పోగొట్టుకొనుచుందు. (ఇంచుకయూరకుండి) ఆహా! నిదురపోవుదమన్నను రాకున్నదికదా. నిలుచున్ననుగూరుచున్నను, మేల్కనియున్నను, శయనించుచుండినను, మిత్రుని సంభాషణయే వినబడినట్లుండును. (జయంతునుద్దేశించి)

క. నడచితినే నీమాటల
కడుగైనందాటి యెప్పు ♦ డతికూరుడనై
ముడచితినే పరధనముల
విడనాడగ నేటికయ్య ♦ పీరచుంతా?.

ఇంతకును మనమైత్రిని భంగముసేయుట కావారాంగనయే ముఖ్యకారణము (మోహినినుద్దేశించి)

తే. గీ. పరగ జయపాల్జయంతుల ♦ భవ్యమైత్రి
లతను ద్రెంచి వేయుటకునై ♦ క్షితితలమున
బుట్టుకను బొందియుండె గా ♦ బోలునకట
నిక్కముగజూడ నీమోహి ♦ నీజగంబు

(జయంతునుద్దేశించి సఖా! జయంతా! పరిపూర్ణజ్ఞానసంపన్నుడవగు నీవుకూడ నజ్ఞానాబ్ధిలో బడితివే నాపల్కుల నించుకయు నమ్మకపోతివి అక్కటా! నామైత్రి వీడితివి (అంతలో దలుపునీయు చప్పుడు వినవచ్చును.)

జయపా—((తలుపులు చప్పుడువిని)తలుపు చప్పుడగుచున్నది. ఎవరైన నివతలకు వచ్చుచుండిరికాబోలు. ఇచ్చట శయనించియుం

నన్నుజూచి యేమియు ననరుకదా. సన్యాసివేషధరుండనై యున్న నన్నెవ్వ రేమననెంతురు ?

ప్రభా—(తలుపుదీసికొని రాజవీధిలోనికివచ్చి) ఆహా! నేఁడెంతయు బ్రొద్దుపోయినది, నాథుఁడు వచ్చియుండుటచేతగదా యిట్టులాలస్యమైనది. ఇందు కామేదరి యెంతయాగ్రహించునో కానిమ్ము త్వరగాబోయి నాథుఁడు నిద్రనుండి లేవకపూర్వమే యరుదెంచెద. (నడచుచున్నది.)

జయపా—(ప్రభావతినిలోకించి)ఏమిది ! ఆశ్చర్యముగనున్నది. ఈతరుణీమణి యెవ్వరో యొంటిగా నెక్కడికో పోవుచున్నది. (ఆలోచించి) అంతఃపురపరిచారిక కాదుకదా. అయినచో నర్ధనిశీథమందుఁబోవనేల? నామనంబునందనుమాత్ర మనుమానముజనించుచున్నది. ఎవరైననేమి. ? ఈమె యెక్కడికేగునో నీమెకెరుక లేకుండ నెంటనేగి యుదంతం బారసెద. (అని నడచుచున్నాఁడు.)

(అంత తెఱలేచును.)

(మేదరిగృహము.)

(ప్రవేశము—మేదరి వెంకడు.)

(తనలో ఆకసమువంకజూచి) అబ్బో ఆకసాన పిల్లలకోడి వచ్చ రత్తం ఆపుడే చాలదూరం పోయింది. నాముద్దులమితారి పభావతిసాని యింకనూరకున్నదే! ఆయంచగున్న యిప్పుడేఒచ్చునోయికనేఒచ్చునో యని చూడలేకనాకన్నులు పొడికన్నులై పోయినవి అబ్బబ్బా పానింయి నుగుతోందిగంద ! మారాస్యం ఓరికి తెలలేదుకద ! తెలిస్తే నాపాణాలు పోయినట్టే సందేలమా రాచోరిపిల్లతోపొత్తు పాణాలు తీస్తాదేమో అని బయం అగుసుండాది కాని ఆలేతమావిసిగురుబోలు అయొయ్యారి బామనుతలచుకుంటె నావళ్ళంతా కాకరకాయలాగున జలపరిస్తాది యిరాళి యెచ్చొతాది కళ్ళెర్రబడతాయి ఆజాయనినాకు పిచ్చెత్తుతాది

కరచేపాము కొట్టేభూతము కానరాదు. సివాలెక్కుతాయి కూడుసై
చదు ఏమిసేయను మరికాని నిజానికి తలిస్తే యెదవపనేకాని ఓడిపెళ్ళా
న్ని మరోడాతగుల్కొనిసిగ్గులేక వాసిబాసి యెందరు పోకిరీలంజకొడు
కులు నావంటివాళ్ళునారు యింతకూనాపున్నెంసేత ఆరాసపిల్లనాకు
లబించింది కాని అందరికిలబిస్తుందా నాపున్యెంనాభాగ్యం నాలదరో
ట్టంమంచిదీ ఏంసెప్పమా యీయా యింతాలస్యం దాని మొగుడుగీని
రాలేదుగంద (ముందుచూచి) అదిగో అదిగో నామిఠారికత్తె నాగురు
విందపూలబంతి తక్కుచూతారుచూ వస్తోంది రానీ దీని తస్సాజండా
నాతడాఖాచూపిస్తాను.

[జయపాలుడు రహస్యముగ వెనుకనుండి వచ్చుచుండ

పరిభావతి ప్రవేశము]



వెంకడు—అదిగో అదిగో నారతనాలమూట వచ్చినది రారా
అయితే పరిభావతీ నేడింత జాగేలసేసినావో చెప్పమా ?

[కనబడకుండ దాగియుండును]

(6) సాంగు—వెంకడు—బొరువ-ఏకతాళం

1 ఓసోసిరాసపిల్లవొచ్చేసినావటే । చూచుకోవెనాదీతమాస॥ ఓసిపిల్ల॥
చూచుకోవె నాదీతమాస॥ నిసిరేతిరామొకదె । నేడేలరావైకా
వసివాడినానేయీయాల॥ ఓసిపిల్ల॥ వసివాడినానేయీయాల॥ !
ప్పుడేవస్తావో యికనేవస్తావో । యెదురొచ్చిసూసూతున్నానె ।యి
సింతసప్పుడైన నీవానుకొంటినే । చొప్పతగ్గిపోయె । చూపుతో
లగీపాయె । యొప్పొలకుప్పారాగవేద॥ ఓసిపిల్ల॥

1 యీయెదురుబద్దతో । యీపు పెట్లగొడతాను। ఏమేయింతాజాగు
సేయా॥ ఓసిపిల్ల యేమే యింతాజాగు॥

ముద్దులిత్తూవంచు । మురిపెముతోనుండి।సుద్దులాడావేమెశోభా
నమురావె ॥ ముద్దూలాగపల్కవేమె । ఓసిపిల్లగద్దారితనమాటె
నాతో॥ నీవింతపొద్దూపుచ్చానేలెచిలుకా॥ సెప్పవేమి ఓసి ఓ
రాసపల్ల ॥

వెంక.—(ప్రిభావతింజూచి)అన్నులమిన్నా।నేడింతయాలస్య
మైనదేమి ?

జయపా—[స్వగతము] ఈమెమాత్ర మెవ్వరోతెలియకున్నది.
వీఁడుమాత్రము మేదరియని తెలియుచున్నది. అయినను నీమె యేమి
ప్రత్యుత్తరంబిచ్చునో చూచెదను.

ప్రిభా—ఓయూ ! మేదరినాయకా ! నేటిదినంబుననాభర్త్తయ
రుదెంచుటంజేసి యాలస్యంబైనది. కావున క్షమింపుము.

జయపా— (తనలో) హా! తెలిసినది. ఈమె తప్పక యూపురం
బునేలురాజునకుఁబుత్రియు, నామిత్రుడగు' జయంతునకుభార్యయునై
యుండును. ,,నాభర్త్త నేటిదినంబున వచుటంజేసి యాలస్యంబైనది"
యని వక్కాణించుచున్నది. నేటిదినంబున నిచ్చటికివచ్చినది నా
మిత్రుఁడేకదా.

తే. గీ. నీచ మతి నీచమందును ♦ దోఁచనీయ
దెట్టిదుర్మార్గకార్యంబు ♦ నేనిసేయ
బుద్ధిపుట్టించుచుండును ♦ మోహమహహ
యెట్టివారలకైనను ♦ నెంచిచూడ.

అయి ను ముందుగ, దొందరపడనేల. ఇంకను నీమెసంభాషణ
విందును

వెంక—ఏమీ నీమగడేవచ్చినాడా ! జయంతుడేనా ?

ప్రిభా—కాక మరెవ్వరు !

జయపా—(తనలో) ఇప్పటికి స్పష్టమైనది. ఈశరుణి జయం తుని భార్యయే. అక్కటా! ఇందుకేమని చింతింతు.

మ. జనసంబందెన్ను రాట్కులంబున మహా ♦ సౌభాగ్యముంగాంచిదు
ర్జనదూరుండగు మాజయంతునకు భా ♦ ర్యారత్నమై వేసవేల్
వనితల్ భక్తిమెయిం నిరంతరము సే ♦ వల్ సేయగానుండు, ని
వ్వనితారత్నము సిగ్గులేక యకటా ♦ భావ్యంబె యిట్లుండగన్.

ఆహా! పావనంబగు వంశంబునం గళంకము ప్రాప్తించుట యిట్టివారి వలననేకదా.

క. ఎక్కడ రాడ్వంశము మరి
ఎక్కడ మేదరికులంబు ♦ నింతేనియు లో
నక్కట సిగ్గునుబూనక
యిక్కన్నియ పీనిఁగూడు ♦ టేడ తలంపన్.

(ప్రభావతి నుద్దేశించి)

తే. గీ. నిన్ను గుణరాసిగా నెంచె నీధవుండు
కులటవై యొప్పుచుంటివి ♦ కోర్కె మీరి
నుభయకులంబులకీర్తికి ♦ నుర్విలోన
భంగముం గల్గజేసితె ♦ పాపచిత్త.

ఓసీ! ఛండాల! నీవువేశ్యవై జన్మించుటకు మారుగా నుత్తరియకాంతవై పుట్టితివి నీమూలంబున నెంతమందికి దుర్యశంబు సంభవించునో యెఱుఁగలేక పోయితివి.

వెంక—నీభర్తయేవచ్చిన నీవునాగడకికి రాకుము. నీదాకనీది నాదారినాది పేగపొమ్ము.

ప్రభా—నిన్ను నమియున్న నన్నుఁ జిన్నచూపునఁ జూడన్యాయమా. నీవేనాకు ప్రాపని మది సంతోషపడుచుంటి.

జయపా—[తనలో] ఆహా ఈకులటయెంతసిగ్గువీడి పలుకు చున్నది. తుచ్ఛుఁడగు వీనిసంగతివిడబాయలేక యెట్టకర్ణకఠోరమగు పల్కులనుగ్గడించుచున్నది. అక్కటా! భగవంతుడీ మోహమునుదాని నేల సృష్టించెనోకదా!

వెంక—ఇంకనిన్నాతడు తనయింటికి తీసికొనిపోవునుగదా యిక నీకునూ నాకునూ యెట్లు పొత్తుకలుగును ?

పరిభా—నిన్ను విడనాడి యేగుమనను కొంటివా. అట్లెన్నటికి ని తలంపకుము.

వెంక—వెళ్ళక యేమిచేసెదవు?

పరిభా—మరెయొకప్పుడు వత్తునని పలికెదను.

జయపా—(తనలో) ఈజారిణి భర్తలేనంతకాలంబును వీనితో సుఖంబుగ వర్తించుచున్నది. ఇప్పుడుకదా సతులనుబుట్టినింట కడపెద్ద కాలముంపఁగూడదని నాకుఁదోచినది. ఉంచినను సందటునిట్లేయొన ర్తురా! ఎక్కడనో యిట్టిదుష్టచిత్తు లుందురు.

వెంక—ఎప్పటికైన నీవత్తవారింటికేగ వలసినదానవే కదా?

పరిభా—అట్లయినచో నీదగ్గఱనున్న కత్తినాచేతికొసంగుము. చిత్తంబున భీతిలేక నిదురించుచున్న నానాథునిఁ జంపివచ్చెదను. పిదప మనమిచ్ఛాకేలీల వర్తింపవచ్చును.

వెంక—అట్లుతప్పక చేసెదవా! అటులైనచో గానిమ్ము.

జయపా—[తనలో]

మ. కులటా!ప్రాణధవున్ వధింప మదిలో ♦ గోర్కెన్ విలోకించితే
తులవా! మేదరిభీతిలేదె యిటు నీ ♦ తోఁగూడియున్నట్టి యీ
లలనన్ భర్తనుజంపి రమ్మనుచు నా ♦ హ్లాదంబునం జెప్పుదే
యిల మిమ్మిద్దరజంపినన్ వినుడఘం ♦ బింతేనియున్ రాదుఁగా.

1. ఎంతకైనను తగినదానవె। యింతిభర్తృనాశినీ।కాంతుగొంతుక గోయనెంతటి। కార్యముగా దలపెట్టితే॥ ఎంత॥
2. మేకవెన్నెల పులివిధైపతి । మ్రింగజూచితె ఘాతకీ । వీకతో మేదరిని గూడుచు । విభునిజంపగ నెంచితే॥ యెంత ॥
3. అక్కటస్త్రీజాతి ధారుణీ । నెంతకైనను జాలదే । మక్కువలు చూపించి విషమయ మానసంబున జెలగరే ॥ఎంత॥

(ఇంచుకయాలోచించి(ఆహా! కలికాలంబున నెన్నిచిత్రింబులు గనుపించుచున్నవి. స్వమతస్వగౌరవాభిమానంబులడుగంటినవి.లజ్జవిడ నాడఁబడినది. సజ్జనులకు హాని తేఁదలచుదుర్మార్గులనేకులుప్రబలిరి కూటసాక్ష్యంబులొసంగి ధనంబుఁగొనుచు మహానుభావులమని విఖ్యాపీ గు నవివేకులా పెక్కుమందికలరు. ప్రార్థనలంగీకరింపక, తుదకుదానికి బ్రత్యుత్తరంబైనను నిచ్చి నేని పరువుపోవునేమోయనితలచుచు, మంత్రిలహస్తంబున బొమ్మలలాగున నాయుభూనేతలు వెలసినారు. గురు శుశ్రూషజేసిసమస్తవిద్యల నభ్యసించి తుదకుగురువుపైఁగాలుద్రువ్వ కొంటెశిష్యులుప్రబలుచుండిరి. పెద్దపెద్దయుద్యోగంబుల కాసించికొం దఱుకుమతులు తమభార్యలయెడజేయు దుర్మార్గకృత్యంబులు దలంప రాదుకదా. పతిసేవవిడనాడిస్వైరిణీవృత్తిబూని చరించు సంసారతరుణు లుసిగ్గులేక మందమందలుగ బయలుదేరుచుండిరి. నేఁడువిటకానిపైఁ బ్రేమచేఁ దనభర్తనుగూడ, జంపదలంచుగాంతను గన్నులారఁ గంటిని ఓహోహో! ప్రపంచంబున నింక నెన్నిమాయలు కలవో !

ప్రభా—మేదరనాయకా! ఆలోచింపక కత్తినొసంగిపంపుము.

వెంక—(కత్తియొసగి)ఇదిగో నీవీకార్యమేలా చేసెదవోనుమా యేరికైన తెలిసినచో నీమాటకేమి ముంమునాపుట్టిమునుగునువెలాగైన నీమగనితుదముట్టించినచో మనము యిచ్చవచ్చినట్లు తెక్కొరబిక్కొర లాడుకొనుచు ప్రాణాలున్నంతవరకు హాయిగానుండవచ్చును.

ప్రభా—అతిరహస్యముగజరిపివచ్చెద (నిష్క్రమించుచున్నది)

వెంక—(నిష్క్రమించుచున్నాడు)

జయపా—(స్వగతము) ఈపాపాత్మురాలీతుచ్ఛని బొందుటకై భర్తజంపుట కేగినది ఆహా! నాప్రాణమిత్రుండగుజయంతుఁడుభార్యహస్తంబున మడియునా. అక్కటా! ఇప్పుడేమిసేయుదును? (ఆలోచించి) దీనికి నాలోచింపనేల ?

తే. గీ. ప్రాణమిత్రునివేగ జం ♦ పంగనున్న
యతివనిప్పుడు వారించి ♦ యనుగుసఖుని
ప్రాణములగాంచి వెలయుటే ♦ భవ్యమార్గ
మంచు జిత్తంబునందుఁ ద ♦ లంచువాఁడ.

కావున నేమాత్రమును జాగుసేయక నీమెవెంటనేఁగి యెట్లైనను నాప్రాణమిత్రుని ప్రాణంబుల గాపాడెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—ప్రభావతిసౌధము.

ప్రభావతి—(ప్రవేశించి తలుపుదీసి) అందఱును నిద్రావస్థనే యున్నారు. నాకార్యమునెరవేర్చుకొనవచ్చును. [ఆనినిద్రించుచున్నజయంతుని సమీపించి] ఆహా! ఇప్పుడునేనీతనిజంపవలసినదేనా. ఇట్లాచరించితినేని యీతఁడు మడిసిన యనంతరమునా మొగంబుజూచువారెవ్వరు? వితంతునై యొరులకంట బడఁగలనా. భర్తనుజంపినమహాపాతక మెన్నటికైనను బోవునా. ఒకవేళప్రపంచంబున కీసంగతియు దు ముందు దెలిసెనేని నన్నునిందింపరా. కావున నీకార్యముసేయకుండుట యేమేలని తలంచెద. [ఆలోచించి] ఇప్పుడీకృత్యంబు సేయుట మానితినేని మేదరిస్నేహమునకు భంగమువచ్చును. అతనిబాసి యొక్కత్రుటి కాలంబైనను మనగలనా కావున నేనునుకొన్నకార్యము చేసితీరెద [కత్తినెత్తి] శరీరము కంపమెత్తుచున్నది. హృదయంబునధైర్యమాగుట

లేదు [ఇంచుకయూరకుండి అక్కటా! ఎంతపాపకార్యము సేయఁదలం చితిని. భర్తనుజేతులారా జంపఁదలంచుచుంటినే. [ఆలోచించి] ఇంకనా లోచించిన దోఁ బ్రయోజనములేదు. ఆలస్యంబయిన చో ముప్పువాటిల్లు ను. ఏమైననరే వధించితీరెదను. (జయంతునికంఠంబునకత్తికిసేయును)

జయపా—[తొందరగాఁ బ్రవేసించి]

శా. ఘోరంబైన ఖరాసిబూని మదిలో ♦ గొంకేమియుక్ లేక యీ
మారాకారు వధించి మేదరికుల ♦ ప్రావిర్భవున్ గూడగా
ధీరత్వంబుననెంచిపట్టి నిను న ♦ గ్గిన్ నేనివారింపఁగా
జేరన్ వచ్చుచునుంటి చంపకుమి రా ♦ జీవాక్షి ప్రాణేశ్వరున్.

[ప్రభావతి కరము పట్టుకొనుచున్నాఁడు.]

ప్రభా—[జయపాలుంజూచి]

చ. ఎవఁడవురోరి నీవిటు లొ ♦ కింతభయ బును బూనకుండ, భూ
ధవసుత సౌధరాజము ము ♦ దంబునజొచ్చి కరంబు బట్టు దే.

జయపా—

ఎవఁడనునైననేమి రమ ♦ ణీ పతిజంపగనున్న నిన్ను భూ
ధవునకుబట్టియీయఁగ ము ♦ దంబునవచ్చితి నిట్టిరూపుతోన్

[8] సాంగు జయపాలుడు జంగలారాగం-రూపము.

1 ఛీఛీ కులపాంసనీ! పతి జెండినావొకో। నీమమేవరికైదు ర్నీతి బూనెదే॥ ఛీఛీ బూనెదే॥ ఛీఛీ॥

2 గౌరవరాజకులాంబుధి। గరళముభంగి। మారణకారణమై జన్మం బుగాంచితే॥ ఛీఛీకుల॥

3 సీకతనరాజవంశము నీతిమాసెనే।లోకము నీయపయశముసింగోల మయ్యెనే॥ ఛీఛీకుల॥

[చచ్చియున్నజయంతునిజూచి] హా! కులటా! నేనురాకము నుపేయంతంబునొందించితివా. ఛీ! పాంసురాలా! ఎంతక్రూరకృత్యంబు

గావించితివి! నీచక్షులుండగు మేదరింగూడి సౌఖ్యంబులందఁదలఁచి యిట్టిక్రూరకార్యం బాచరించితివా. ఈపనినీవుజేయుచుండ నెవ్వరు జూడరని తలంచితివికాని యంతరిక్షచరులగు సూర్యచంద్రాదులకెఱుకలేనిదీప్రపంచంబునందుండునా. ఓసీ! పాపాత్మురాలా! తుచ్ఛంబగు నిహలోకసౌఖ్యంబులకాసించి యెంతదుష్కార్యంబొనరించితివి. ఈ పాపమునీకెన్నిజన్మంబులకైననుబోవునా. నీవుబుట్టుటంజేసివంశంబునకు గూడ నపకీర్తివచ్చినదే? ఒక్కొక్కసమయంబునందు గటికివానికైననుగోత్రగోయుటకుఁ జేయిరాకుండును. అట్టియెడ దైవసమానుడగు ప్రాణనాథునికంఠము తరుగుటకు నీచేతులెట్లాడెనోకదా. అవును మోహమే చేతులాడించును. కరకుతుఱకగర్భంబున బుట్టుటకుమారుగా రాజవంశమున జన్మించితివిగాని రాజపుత్రికాగుణంబులుమాత్రము కంచుకాగడఁబెట్టి వెదకినను గానరావు. జారిణివై ప్రాణేశ్వరునిఁ జంపిననిన్ను ముక్కముక్కలుగాఁ జెక్కినను పాపంబు సంభవింపదు.

(జయంతునిజూచి)

తే. గీ. అనుగుసఖుడ! కులట భార్య • హస్తమందు
బ్రాణముంబాసిపోతివే • పరమమిత్ర
నన్నువిడనాడి కృపలేక • యన్న! నిన్ను
గానఁజాలనైతిని కాల • కర్మగతిని.

హా! మిత్రశేఖరా! మనస్నేహాభంగ మెంతచేసినది. నీస్నేహము పీడినప్పుడేబ్రతుకుటదుర్లభంబనితోచిన నాకునీవుస్వర్గపురంబునకేగుటకనులారజూచి ప్రాణములతోనిల్వగలనా? అయ్యో! నన్నుమఱచిపోతివా. నేనెంత బ్రతిమాలుకొన్నను నావాక్యంబుల నాలింపక నన్నుద్రోసిపుచ్చితివి. అయ్యో! నాగతికేమనివగతు, నీవు లేని యీజన్మమునాకేల? అతిమృదువైన నీకంఠముకులటయగు నీభార్య నఱకుచుండ నీవెట్లోర్చితివోకదా.

పరిభా—(తనలో) ఈతడెవ్వడో తెలియకుండెను. ఇప్పుడు నేనుమాటాడక యూరకుంటినేని ముప్పువాటిల్లును. కావున నొక్క చిత్రమును బన్నియీతనిని రాజభటులకప్పగించెదను.(ప్రకాశముగా) ఓహో! రాజభటులారా! ఎవ్వడో యొక్కదుర్మార్గుండు భీతిలేక నాసౌధమును జొచ్చి నిదురించుచున్న నాభర్తనుజంపుతున్నాడు సత్వరంబుగవచ్చి రక్షింపుడు రక్షింపుడు.

(అనిబిగ్గరగాఁ గేకలువేయుచున్నది.)

[అంత నిరువురురాజభటులు ప్రవేసించుచున్నారు.]

రాజభటులు—(తొందరతో) ఏఁడి! ఆతుచ్ఛుఁడు.

పరిభా—ఆతఁడే. ఆతఁడే.

జయపా—(స్వగతము)ఆహా! కాంతలెంతకైనను జాలుదురు. ఈటక్కులాడియెంతమాయపన్నినది. అక్కటా! ఇప్పుడు నేనేమిచేయుదు (ఆలోచించి) చేయుటకేమున్నది. ఎన్నియవస్థలుప్రాప్తించునో వాటినన్నిటిని ననుభవించుటకు సన్నద్ధుడనై యుండుటయే కర్తవ్యము. (ప్రకాశముగా) రాజభటులారా! మీరాలోచింపనవసరములేదు. ఈరాజనందనునివధించినదుర్మార్గుడను నేనె. నన్నుమీరాయిచ్ఛవచ్చినట్లు చేయవచ్చును.

రాజభ—రమ్మా. నిన్ను మేమిప్పుడు కారాగృహంబునఁబడవైచి తెల్లవారినపిదప రాజుగారి సన్నిధింబెట్టెదము. (అనిజయపాలుని గారాగృహంబునకుదోడ్కొనిపోవుచున్నారు)

పరిభా—ఇప్పటికి నాహృదయము చల్లఁబడినది.

(నిష్క్రమించుచున్నది)

ఇది ద్వితీయాంకము.





# సంగీతజయంతజయపాలము.



## తృతీయాంకము.

[కారాగృహము.]

జయపా—(తనలో) కష్టా! తుదకునాయవస్థయిట్లుగా, బరిణమించినది

(9) సాంగు—జయపాలుష్టు సింధుకమాచి, ఆట—సామగయే.

1 హావిధి వైదములు । ఆశ్చర్యములు ॥ హావిధివై॥

పున్నెమునకునే । బోన పాపమెదురయ్యె । యెన్నరాని బన్న మందితి॥ హావిధి॥

2 సతులమాటలనే । సత్యమందురుధాత్రి । అనృతము కాపుష్షులా డిస మాటలు॥ హావిధి॥

దీనికంతకును నగవనుగాని మిత్రుని మరణంబునకు మాత్రము వగచుచుంటిని. (ప్రభావతినుద్దేశించి) హా! చపలచిత్తా! జారిణీ! గోముఖవ్యాఘ్రిమా! ఎంతటిదానవే. రాజభటులకడ నెట్టిమాయబన్ని నన్ను కారాగారనివాసునిగాఁజేసితివి. ఆసమయంబునకుఁ దప్పించుకొనుటయే ప్రధానంబని తలంచితివి గాని నెమ్మదిమీఁద సత్యము బయలుపడునని యెఱుంగలేకపోతివి. నిరంతరంబును జయంతునిగలిసి చరియించు నేనిప్పుడొంటిగ నాతనినిస్వర్గంబునకుబంపిసంచరించుచుంటివిగాదా? నందనోద్యానంబులందు విహరించు నేనిప్పుడె కారాగృహంబునందు విహరించుచుంటిని. అవును. పురాకృతప్రారబ్ధ మనుభవింపక తీరునా?

వీరసేనుఁడు—[ప్రవేశించి] కారాగృహంబునందున్న సన్యాసి జయంతుని నర్ధరాత్రియందు వధించెనని తేఁబడిననేరము మాతండ్రి

గారు విచారణసేయఁబోగాఁ నేను వారినివారించి యందలి నిజంబునా రసెదను గావున మూఁడుదినంబు లందుకు గడువీయుడని కోరఁగా వా రంతులకు సమ్మతించిరికదా. [ఆలోచించి] ఆసన్యాసియేమి? అర్ధరాత్రి యందు నిర్భీతితో రాజపుత్రికాసౌధంబుజొచ్చి జయంతుని వధియిం చుటేమి? ఇదినాకుమిక్కిలి యనుమానముగనున్నది. కావున నిందలి నిజమైనయుదంతం బీసన్యాసినే కనుగొనవలెను. (సన్యాసినిసమీపించి)

తే. గీ. నీదురూపంబుజూడ ము ♦ నీందుశ్రీభాతి
గానుపించుచునుండెను ♦ కరుణలేక
చెఱను పడవైచె నెవ్వఁడు ♦ చెప్పుమయ్య
సంతసంబునుగూర్తు నీ స్వాంతమునకు.

జయపా—

తే. గీ. నీవు వచియించుచట్టుల ♦ నేను మునినె
కాని నాదుపురాకృత ♦ కర్మవశము
చేతఁ బొందగాఁగలిగి ♦ జెఱను; నేమి
పల్కుటకు నోరురాదయ్యె ♦ భవ్యచరిత.

అయ్యా! నాయందుఁ గృపాంతరంగుడవై నాక్షేమాలింప నెంచిన భవదీయనామం బెద్దియో తెలిపి నన్నానందపఱచెదవా ?

వీర—ఓయీ! నేనెవ్వరినో కనుఁగొనలేకుంటివా. ఈపట్టణం బేలుమహీపతికి నాత్మజుండనగు వీరసేనుఁడ.

జయపా—రాజకుమారా ! అట్లయినచో నంతయు తెలిసియుం డియు నడిగెదవేల? నీసోదరీ సౌధంబు నర్ధరాత్రియందుఁజొచ్చియామె భర్తను జంపితినని నన్ను జెఱసాలయందు వైచినసంగతి నీ వెఱింగి నది కాదా.

వీర—జయంతుని నీవు వధియించినది నిజంబేనా?

జయపా—నిజముగనుకనే నాకిట్టిశిక్ష విధింపఁబడినది.

వీర—ఆపలుకుల కేమిలెమ్మ. నీవు సన్యాసివేష ధరుండవగు నొకక్షత్రియ కుమారునివలె, గాన్పించుచుంటివి. నీవేషము నేటికి ధరించితివో చెప్పుము. నీస్వాంతంబున భీతిజెంద నవసరములేదు.

జయపా—అయ్యా! నానిజవర్తమానముతో నీకేమిపనియున్నది?

వీర—జయంతుని వధనుగూర్చి నాకనుమానము బుట్టుచున్నది. ఆకారణంబున నిన్నడుగుచుంటి. సందియంబందక వచింపుము.

జయపా—సందియ మేమున్నది? అతనిని వధించిన పాపాత్ముడను నేనే.

వీర—నీవు వచించిన వాక్యంబు నేనునమ్మజాలను. ఈసంగతి నిగూర్చి మాతండ్రిగారు విచారింపఁ దలంచియుండగా, నిందలి నిజంబు నేను గనుఁగొనెదను గాన మూఁడుదినంబులు గడువీయుడనికోరితి. అందులకు వారు సమ్మతించిరి. ఆకారణంబున నేనిప్పుడిచ్చటకువచ్చితి కావున నిందలి సత్యంబంతయు నీవలనఁ దెలిసికొనవలెను.

జయపా—జరిగిపోయిన దానిని నీవు మరల బయలునకుఁ దేఁ దలంచుచుంటివే. అనవసరముగ లేనిపోని శ్రమ యేల పడెదవు?

వీర—ఏమియు నెఱుంగని నిన్న న్యాయముగఁ జెఱబడవైచి నందు కెంతయు విచారించుచున్నాఁడ.

జయపా—జయంతుని నేనువధింపలేదని నీకుఁదోచుచున్నదా?

వీర—నిస్సందేహముగ.

జయపా—ఎవరువధించిరని నీకుఁ దోచుచున్నది?

వీర—స్త్రీలు కడుసాహసులు కదా, ఎప్పటికెట్టిమాయబన్నఁగలరో యెవ్వరెఱుంగుదురు?

జయపా—రాజకుమారా! నీబుద్ధికి సంతసించితి. ఇందలి నిజంబునీకు రేపురాత్రి నాకడ కరుదెంచి యారేయియంతయు నాతో నుంటివేని తెలియఁజేసెదను పొమ్ము. [నిష్క్రమించుచున్నారు.]

రంగము—ప్రభావతిసౌధము.

[వీరసేనుడు జయపాలుడు ప్రవేశించుచున్నారు.]

వీర—నన్నిక్కడకు. గొనితెచ్చితివేల? ఇది మాప్రభావతిసౌధమే!

జయ—చిత్రమగు నాటకంబంతయు నీస్థలంబునుండియె నీవు వీక్షించెదవుగాక. నేజెప్పినట్టు మాత్రము చేయుచుండుము. సమస్తము ను నీకు విశదము కాఁగలదు. మనమీ యరుగుమీఁలను పరుండి యుందము. పిమ్మట నేమగునో చూచుచుందము.

వీర—నీవు చెప్పినయట్లే చేయుదను.

[అంత నిరువురు అరుగులపైఁ బండుకొనుచున్నారు.]

(అంత తలుపుచప్పుడు వినవచ్చు చున్నది)

వీర—ఓయీ! తలుపుచప్పుడు వినవచ్చుచున్నది. ఎవ్వరైనను మనలజూచి యానవాలు పట్టరుకదా.

జయ—మనల నెవ్వరును నేమియు ననరు. నీవు చూచుచు మాటలాడక యూరకుండుము.

ప్రభావతి—[తలుపు దీసికొని రాజవీధిలోనికివచ్చి) ఇంక నేను మేదరి గృహంబున కేఁగి సత్వరంబుగ రావలెను. (నడచుచున్నది.)

వీర—(జయపాలునితో). ఏమీ! ఆశ్చర్యముగనున్నది. ఈమె నాసోదరియే, ఈయర్థరాత్రిఁబున నెక్కడికేగుచుండెనోకదా! కనుఁ గొందునా?

జయ—నీవేమియుఁ జేయఁగూడదని చెప్పియుంటిని కదా. అట్లుమెనఁ జేసితివేని నేకారాగృహంబులోనికిఁ బోయెదను.

వీర—ఏమియుఁ జేయను. నీయాంతిప్రకారము వర్తించెదను. ఇంక నిప్పుడేమి చేయుదము?

జయ—ఇప్పుడు మనమీమె వెంట నీమెకుఁ గనబడకుండనేఁగ వలెను. తరువాత నీవే చూచెదవు.

## తృతీయాంకము.

(ఇద్దఱును పరిభావతికిగనంబనుండ నడచుచున్నారు)

వీర—మిత్రమా! నామనసంతయు డోలాయమాన మగుచున్నది. నాసోదరి నిర్భీతిగ నర్ధరాత్రంబున నొంటరిగ నింతదూరం బరుదెంచినది. ఇప్పుడు మేదరిగూడెము బ్రవేశించుచున్నాము. ఛీ ! ఇక్కాంతయిక్కడికేలవచ్చుచుండెనోకదా! స్నేహితుడా! ఇంకసంశయింపక నీఖడ్గంబుచే నీమెను నఱికివైతునా.

జయ—అదియేకదా వలదని చెప్పితిని. అట్లయినచో నాదారిని నేఁబోయెద. నీయిచ్చవచ్చినట్లు చేసికొనుము.

వీర—మాన్లాడను. లేదు. లేదు.

[తెర లేచును]

మేదరిగృహము.

వీర—ఆహా ! ఏమిది! సిగ్గులేక నా సోదరి యీతుచ్ఛుని గృహంబు బ్రవేసించుచున్న దే ! మిత్రమా ! నాకుఁ గోపం బాగకున్నది. ఈకరవాలంబుతో నాసోదరి శిరంబును ఖండించుదునా ?

జయపా—మాటిమాటికి నీవిట్లు పలుకుదువని తెలిసియుండెనేని నేను నీతో రాకనేయుందును.

వీర—ఓయీ ! స్నేహితుడా !

తే. గీ. క్షత్రియాన్వయమందున ♦ జన్మమంది
విమలకీర్తిపరుండైన ♦ పృధ్వీపతికిఁ
బుత్రియై ; నీచు మేదరి ♦ పొందగోరె
నక్కటా చూచి సహింప ♦ నగునెనాకు.

ఉ. స్త్రీవధ పాపమెంతయును ♦ జెందినఁ జెందగనిమ్ము నన్ను ధాత్రీవిభుఁ డుగ్రుఁడై యురి ♦ దీసినఁ దీయగనిమ్ము నల్వురుఛీ ! వెలఁదిఁ వధించెనని ♦ చెప్పిన చెప్పుకొనంగనిమ్ము ; నే నీవనితన్ వధింపకను ♦ నెంతయుసైపగజాల మిత్రమా !

ఆహా! స్త్రీలమాయ ! "చేసెడివి మాఘస్నానములు. దూరె డివి దొమ్మరగుడిసెలు." అనునార్యోక్తి యీఘండాలియందుఁ గన్పట్టుచున్నది.

జయపా—నాయిచ్చవచ్చినయట్లు నీవు వర్తించెదవా ! లేక నన్నుఁ గారాగృహంబునకుఁ బొమ్మని యాజ్ఞయిత్తువా ?

వీర—సఖుఁడా! నాసోదరి నాకనులయెదుట నిట్టిదుష్కార్యం బొనర్చుచుండఁగా నెట్లూరకొనుమని చెప్పగలిగితివి? ఇట్టిదుశ్చారిత్రలను బ్రపంచకంబున బ్రతుకనిచ్చినదో వంశంబునకెల్ల దుర్యశంబు సంభవింపదా ?

(10) సాంగు వీరసేనుఁడు శుద్ధబంగాళా-త్రిశ్రజాతి.

1 కటకటకర్ణక । ఠోరపువాక్యము । లెటువినిసహించుదున్॥ అసులతో॥

సోదరినీచునిమేదరిగూడుట । చూడగలిగెఘనశోకముహెచ్చెను॥కట

2 తలవంపులునాకు ॥ గలిగెనేమిసేతు । నిలచరియింపగ । నింతయు సైపను॥

3 యీగతినామది ! యెట్టికార్యమైన । సేయగనోపునె । చింతల నయ్యెను(కటకట॥

జయపా—యిప్పుడు నీవింతతొందరపడితివేని జయంతునివధను గూర్చి నీకు నిజంబెట్లు తెలియును కావున నేమియు మాటలాడక నీ చాటునడాగి నీసోదరియు మేదరియు జెప్పుకొనుపలుకుల నాలింపుము.

వీర—నీవు చెప్పినట్లే కావించెదను.

(వెంకఁడు—పరిభావని ప్రవేశించుచున్నారు.)

వెంక—ఆ ఏంటీ ! ఆపనికాజేసి వచ్చేసినావా. ఆమయ్యోసం పేయేశావా ?

పరిభా—అందుకు సందియమేమి?

వెంక—ఏలాసేశావో నాకుసెప్పమా; యీమాటయింటేనా గుండెకాయలు మెడనులిమిన కోడిపిల్లలాగ కొట్టుకుంటున్నాది.

ప్రభా—మొన్న రేయి నీయొద్దనుండిఖడ్గముతీసుకొనిపోయి, నిదురించుచున్న నాభర్తకంఠంబు నఱికితిని. ఇంతలో నెక్కడినుండియో యొకసన్యాసివేషధరుండువచ్చి భర్తనింకను జంపలేదని తలంచి వలదు వలదని పలికెను. పదపడి కొంతసేపటికి నానాథుండు చచ్చి పడియుండుట వీక్షించి నన్నునేక దుర్భాషలం బలికెను.

వెంక—ఓరిబాబో! కొంపముంచావాయేంటి! యీయేకాంతం బయలుపడలేదుగంద. నాపాణాలు కొట్టుకుంటావుండాయి.

ప్రభా—నేనంత పిచ్చిదానననుకొంటివాయేమి? ఆసన్యాసి నన్నట్లు దూషించునప్పుడు నాకేమియుదోచక నామనంబుడోలాయమానమై నారహస్యము బయలుపడునేమోయని భీతిజెంది యొకచిత్రమగు మాయం బన్నించితిని.

వెంక—ఆ! మాయేపన్నేశావు? ఏంసేశావు? ఆలాటిహొంతకారివి కనుకనే యిందుకు సిద్ధపడ్డావు. ఆజాయినేంజరిగింది సెప్పమా.

జయపా—(వీరసేను నవలోకించి) రాజకుమారా! సావధానచిత్తుండవై వారిసంభాషణ మాలకింపుచుండుము.

ప్రభా—అప్పుడు నేను ధైర్యమునుబూని "ఓరాజభటులారా! నాభర్తనిదురించుచుండఁగా నెవఁడో యొక్కదుర్మార్గుడు నాయంతఃపురంబుజొచ్చి యతనిని వధించుచున్నాఁడు. తత్క్షణము చనుదెంచి యతనిని రక్షింపుఁ" డని బిగ్గరగాఁ గేకలు వెట్టితి.

వీరసే—ఆహా! ఎంతదారుణ మెంతదారుణము.

తే. గీ. జారునింగూడ భర్తను జంపి; భీతి
లేక యానేర మక్కటా ♦ లేమమోపె

మరియొకరిపైన; మాయాపత్రి ♦ పంచమంను
నింక నెట్టివారుండిరో ♦ యెంచిచూడ.

ఒసీ ! మాయలాడీ ! పతిభావతీ !

సీ. చిన్నారి పొన్నారి ♦ చిరుతపాపవటంచు
దలపోసె; నీరీతిఁ ♦ దలపలేదు
సుగుణవుం బేటివై ♦ శోభిల్లుదువటంచు
దలపోసె; నీరీతిఁ ♦ దలఁపలేదు
పతిసేవజేయుచు, ♦ బరిఢవిల్లుదువంచు
దలపోసె; నీరీతిఁ ♦ దలపలేదు
దివ్యమౌకీర్తి ♦ దెత్తువటంచును
దలపోసె; నీరీతిఁ ♦ దలఁపలేదు.

తే. గీ. కులటవై యిట్లు వీనితోఁ ♦ గుతలమందు
సంచెరించెదవంచును ♦ సంచితముగ
దలపగాలేదు నిరతంబు ♦ తండ్రి; దుర్గు
ణంపు పేటివౌదంచు ♦ నాతిమిన్న.

[ఇంచుక యూరకుని] ఆహా! స్త్రీ లెంతటిమాయం ౦౦త్రము.

తే. గీ. లజ్జవిడనాడి విటకాండ్రి ♦ పజ్జజేరి
పై కికిత్రిరింగనీతులఁ ♦ బల్కుచుండు
తరుణులఁ బతివ్రతలటంచు ♦ దలుచుకంటె
మోసమొందుగానఁబడదు ♦ భూమియందు.

జయపా—రాజనందనా ? వింటివా ! జయంత వధయందలి సత్యము.

వీరసే—ఏమియుఁ బల్కుటకు నోరాడకున్నది. ఈదుశ్చారిత్రి యెంతపని గావించెను. భర్తనుదాను స్వయముగావధించి, వారించుటకు నేఁగిన నిన్నుఁ 'గారాగారనివాసునిగాఁ జేసెనుగదా. అక్కటా !

ఎంతఘోరమగుమాయ బన్నినది. మిత్రమా! ఇంకనీవు నన్ను వారింపకుము. ఇట్టిదుష్కార్యం బాచరించుచు, వంశమున కపకీర్తి దెచ్చుచున్న యీపరమ దౌర్భాగ్యురాలిని నాకరవాలంబున ఖండించి కృతార్థుఁడనయ్యెద. [ప్రభావతిపై కేఁగనెంచుచున్నాఁడు]

జయపా—నీవట్టికార్యమును జేయుట మంచిదికాదుసుమీ.

వీరసే—అట్లయినచో నీప్రకార మాచరించెద. [అని రాజభటులను గట్టిగాఁబిలుచుచున్నాఁడు.]

వెంక—[ప్రభావతినిజూచి] అదిగో; ఏదో కొంపముంచావు. అల్లరియేదోవినబడుచున్నది. నాకాళ్లువడకుచున్నాయి. నాప్రాణాలుమీదికొచ్చేసిందికాబోలురా బాబు యెప్పుడిలాంటి సంసారఘాతలకి పోరాదురా బాబు.

ప్రభా—నాశరీరమంతయుఁ గంపమెత్తుచున్నది. అరుగో! యెవ్వరో యిరువురుపురుషులాచాయ నిలబడియున్నారు. [పరికించి] అమ్మయ్యో! ఇంకేమున్నది. ఎవ్వరోయనుకొంటిని. నాసోదరుండగు వీరసేనుఁడును, మొన్న రేయి నాభర్తను వధించునప్పుడు వారింపవచ్చిన సన్యాసియు. అయ్యో! మాగుట్టు బయలుపడినది, ఇంకమనకేమిదిక్కు. ఇప్పుడెందుబోగలము. అక్కటా! ముప్పువచ్చినది.

[రాజభటులు ప్రవేశించుచున్నారు.]

రాజభ—ఎవరు మనలఁబిల్చినది.[అని ముందున్న వీరసేనునిం జూచి సమీపించి] మహారాజకుమారా! ఏమిసెలవు?

వీరసే—రాజభటులారా! ఆమేదరిగృహంబుననున్న కాంతామణిని, నామేదరిని దక్షణంబ కారాగృహవాసులఁగాఁ జేయుఁడు. ఇదియే యాజ్ఞ.

[రాజభటులు, ప్రభావతిని మేదరిని గారాగృహంబునకుఁ దీసికొనిపోవుచున్నారు.]

రంగము—రాజసభ.

[చిత్రకేతుఁడు, వీరసేనుడు, జయవర్మ, ప్రవేశించుచున్నారు.]

చిత్ర—కుమారా! వీరసేనా ! అర్ధరాత్రింబు నదుఁ గుమారి సౌధంబుజొచ్చి జయంతునిఁజంపిన యాసన్యాసింగూర్చి విచారింపనెంచిన దినంబు నేఁడేకదా. ఆనేరంబునందలి సత్యాసత్యంబు లరయుటకు మూఁడుదినంబులు నీవు గడువడిగితివి. నీవేమియాలోచించితివి ?

వీర—ఆలోచించుట కేమున్నది. అంతయుసిద్ధమయ్యేయున్నది. [ప్రక్కఁదిరిగి] సేవకా!

సేవ—[ప్రవేశించి] ఏమిసెలవు?

వీర—నీవు కారాగృహంబున కేఁగి యక్కడి రక్షకభటులతో నిన్న రేయి కారాగార నివాసులుగాఁ జేయఁబడిన కాంతను, పురుషుని నదివరకున్న సన్యాసినిదోడ్కొ నిరమ్మని రాజుగారియాజ్ఞగాఁ దెలిపి రమ్ము.

సేవ—చిత్తము. [నిష్క్రమించుచున్నాడు.]

చిత్ర—వీరసేనా ? నిన్న రేయి, కారాగారనివాసులుగాఁజేయ బడినపురుషుఁడునుగాంతయు నెవ్వరు ?

వీర—తండ్రీ! అదియంతయుఁ దమకింకొక త్రుటికాలంబులో విశదముకాఁగలదు, ఇంతలో నేనువచించి తమచిత్తంబునకుసంతాపంబు జేర్పనేల ?

చిత్ర—ఇదివరకే వ్యాకులపడుచున్న నాకు మరింత సంతాపంబు గలుగునా ?

వీర—తమకేకాదు, ఈజయంతునివధమనకుటుంబమునకంతకు సంతాపము గలుగఁజేయుచున్నది. సంతాపమేకాక మన రాజవంశంబునకెల్ల దుర్యశంబు దెచ్చినది.

చిత్ర—నందనా ! అదియించుక నాకుఁ దెలుపరాదా ?

వీర—అదిగో నేరస్థులను భటులు తోడితెచ్చుచున్నారు. సమస్తమును మనకిప్పుడే తెలియఁగలదు.

[సన్యాసి వేషధరుడగు జయపాలుఁడు ప్రభావతి, మేదరి వెంకడు వెంటరా రాజభటులు ప్రవేసించుచున్నారు.]

చిత్రి—పుత్రికా! ఆమె మనప్రభావతియే కదా, లేకనాకట్లు తోఁచుచున్నదా, కాకున్నచో నిద్రావస్థనుంటినా, కలగాంచుచుంటినా.

వీర—తండ్రీ! నీవు జాగ్రదవస్థయందే యుంటివి, ఆమె నా సోదరియు, నీపుత్రికయు నగుప్రభావతియే. అందుకు సందియంబేమియు లేదు.

చిత్రి—కుమారా, నామనంబంతయుఁ గలతజెందుచున్నది. ఇదియంతయు వింతగాఁ గన్పడుచున్నది.

వీర—జనకా! ఈకలికాలంబున వింతల కేమికొదువ. ఇంకమనము ప్రస్తుతాంశమునుగూర్చివిచారింతము. దేవరవారు నాసోదరిని, నీమేదరిని గారాగృహవాసులగుటకుఁ గారణంబడిగి తెలిసికొనుఁడు.

ప్రభా—(తలవంచి కన్నీరు నించుచున్నది.)

చిత్రి—(ప్రభావతి నవలోకించి) కుమారీ! ప్రభావతీ! ఏమిది, ఆశ్చర్యముగా నున్నది. నీవిట్లే తెంచుట కేమిగతము?

వీర—అమ్మాయీ! కన్నీరునించెదవేల? పురాకృతప్రారబ్ధ కారణంబున నిట్టివి సంప్రాప్తించుచుండును. గుట్టుబయలెక్కినది, ఈ రాజసభయందు నీవు చెప్పకపోయినను సత్యాసత్యములు విచారణమీఁదఁ దెలికమానవు. కావున చింతింపక నిజము దెలుపుము.

చిత్రి—(స్వగతము)నిండుసభయం దెట్టిది వినవచ్చునో ఏమి నగుబాట్లు రానున్నవో ఇదియంతయు వీక్షింపగా నాకుఁ జిత్రముగ గన్పట్టుచున్నది. (ప్రకాశముగా) ప్రభావతీ! నీసోదరుని పలుకులకు, బ్రత్యుత్తరంబిమ్ము.

పరి — తండ్రీ! చెప్పుటకేమున్నది. ఇదినాకర్మవా్రత ఇట్లి చ్చట కీడ్చుకొని వచ్చినది. ఇంతకంటె నేనేమియు జెప్పలేను (తనలో) అయ్యో! నాకింక నేమి తెరవు. ఇప్పుడెవరింజేరుదు. అక్కలారా! ఈరహ స్యము నాసోదరునికే తెలియవలెనా; తెలిసెబో యతం డూరకుండక మముగారాగృహంబందుం బడవేయనేల? ఇప్పుడీరహస్యమునిందుకొలు పున బయలుపడక మానదుకదా. చేతులారా దెచ్చిపెట్టుకొంటిని.

వీర — ఓరీ మేదరీ! రాజభటులు నిన్ను జెరసాలయం దేల తోసిరి?

వెంక — యూరాజా! నాకత్తిలోసు. నోనేపాపమెరుంగని ఒట్టి పున్నాన్ని నన్నుదాచలెంకలుకట్టుకొనిపోయిబందెలోయేసినారుబాబు.

వీర — పాపము ఏమియు నెఱుంగని నిన్నన్యాయముగాం బడ వేసిరిగా! (జయపాలుని దిలకించి) తపోధనునిబోలియున్న నీకుంగూడ గారాగృహావాసతయే పట్టెనదా?

జయపా — రాజనందనా! దేవరవారి సోదరియగు నీపరిభావతి సౌధం బర్ధరాత్రంబునంజొచ్చి ఈమెభర్తను వధించినందులకు నన్నుం గారాగృహబద్ధుని గావించిరి.

వీర...నీవు నిజముగా జయంతుని వధించితివా లేదా?

జయపా — ఆసంగతి నాకును భగవంతునకుం దెలియును. అతని వధించితినను నేరము మాత్రము నాపై మోపబడెను.

వీర — ఆపథయందలి సత్యమును నీవు వెల్లడిపఱచెదవా?

జయ — దేవా! మీరెట్టిదండన విధించినను నందులకు సమ్మ తించి యనుభవించెదనుగాని యీనీచమగునోటితో నందలిసత్యమును మాత్రము నాయంతట నేను వెల్లడింపజాల. మహారాజకుమారా! నన్ను మన్నింపుము.

వీర — (మేదరిని దిలకించి) ఓరీ! నీవింక నసత్యము పలుకక

యదార్థమంతయు నెరింగింపుము. అట్లెరింగింపవేని నీవు మరణదండన కుఁ బాలుగావలసి యుందువు.

వెంక—(తనలో) అయ్యబాబో! ఇపుడు నిజమాడకతప్పదు. నాప్రాణంమీదికొచ్చేసింది.ఏలరాకపోతుంది ఎక్కడో అంతప్పురాల్లో నిరాచోరి పిల్లేడ ఎదుళ్లుచీరి మూసివాయినం సేటల్లుకొని పొట్లోసుకొను తాగుబోతు మేదరిముండాకొడుకునునేనేడ, సరచాలేడ, అయ్యో ఆపడుకోరికనాకేల పుట్టాల, అన్నానాబుద్ది యెంతగడ్డితిందో.అచ్చంగాపాలవంటి రాచకులానికి పందిపాలుకలిపేసానుగందా! యీలాట్టి బుద్దిలేనిపని చేసిన నాపాణంమీది కేలరాదు. యేంసేయను. సరే యేంసేయను. యీఈరసేనరాచాయనకు అంతానిజం తెలిసింది. నేదాచిన దాగదు యికేంప్రయోజనంలేదు నామూలాన యీరాచోరిపిల్లపాణాలుకూడాపోతాయిరాబాబు ఏంసేయను (ప్రకాశము) మారాజారచ్చించండి బాబురచ్చించండి యింకమీకాడ అబద్దంసెప్పను ఆమీద దేవరోరికటాచ్చం నాపున్నెం నన్ను మీరేలాసిచ్చించినాసరే నేసిద్దంగా ఉండాను. యీపెబావతిగారికి నాకును రెండేల్లనుంచిచేరికలున్నాయిబాబు.

చిత్రి—[స్వగతము] ఇట్టి కర్ణకఠోరమగువార్త వినినంతనె నా హృదయంబు బగులకున్నదికదా. ఆవిధాత నాహృదయంబుపాషాణంబుతో నిర్మించియుండనోపు. ఉత్తమక్షత్రియవంశ సంజాతయగు నా పుత్రికకును నీచకులుండగు నీమేదరికిని రెండుసంవత్సరములనుండి మైత్రికలదట. ఛీ ఎంతమాటవింటిని "యాదవకులంబున ముసలముబుట్టిన" దన్నట్లు మాయాచనవంశమున కులటయగు నాకుమారి జన్మించెను. ఇప్పుడు నేనేమని విచారింతు.

తే. గీ. పండువంటి కలంబెల్ల • భస్మమయ్యె
సంభవంబయ్యె గడుదుర్య • శంబు; నవ్వ

సమ్యో భూనాధులెల్లరు ♦ నకట; కులట
యాకుమారిక జన్మంబు ♦ నందుకతన.

[11] సాంగు—చిత్రసేనుడు అఠాణా రూపకము.

1 ఎంతఘోరకార్యము । హాంతకారిపుత్రిచేసె ॥యెంత॥ నీచుని మేదరిగలయుచు । కాంతుగొంతుగోసెపుత్రి ॥ఎంత॥

2 పాలపోలురాచకులము, పాడుచేసెతుచ్ఛనెనసి । ఏలీలనుసహింయించెద । యిట్టిపాపకార్యమువిని ॥ఎంత॥

3 ఏమి సేతునెందుజొత్తు ' నిట్టిదుశ్చరిత్రిగాంచి । యీమహీంతల యెత్తిబ్రితుకు । యెంతయు సహింపగలనె ॥ఎంత॥

అక్కటా! ఇంకనలుగురిలోఁ దలయెత్తి మెలగనేర్తునా?

వీర—(రాజును విలోకించి) తండ్రీ! విచారించుచుంటిరేల?

చిత్ర—కుమారా! ఏముున్నది. ఎప్పుడును దలంచియుండని యపకీర్తి వచ్చినందులకుఁ జింతిల్లుచున్నాడ.

వీర—రాజేంద్రా! చింతపడినందువలం లాభములేదు. ఇంక మనము ముందు వినబోవుసంగతులు హృదయనిర్భేదకంబులై యొప్పుచుండును. కావున ధైర్యమునుబూని చిత్తగింపుడు. [మేదరింజూచి] ఓరీ! తరువాత సంగతిం జెప్పుము.

మేద—బాబు! యీమెనాగుడిసికాడికి పతీదినానా నడిరేయి వచ్చేలలవాటుండేది మారాజా ఆమెమగడొచ్చిన దినాన రేత్రికూడ నామకాంకాడకొచ్చేసింది. యేమియింతజాలం సేసావనిఅడిగినా మనామి నేడునాభర్తవచ్చేనాడు ఆతడున్న మనకూటాలకు బంగంవస్తుంది నీకత్తినాచేతికిస్తే నామగడు నిద్దరపోతుండగా సంవేసివస్తాను అనిసెప్పి యీాయమ్మోరు నాసేతికత్తి పుచ్చుకొనిపోయింది. మారాజాఅప్పుడు నేనొద్దనే సెప్పినాను కాసినామాట యినక ఆలాసేసింది యేలికా

చిత్ర—(స్వగతము) ఆహా! స్త్రీలెంతకైనను జాలుదురు.

తే. గీ. మంచివారకరణిగాను ♦ పించుచుండు
రెన్నిమాయలో పన్నగా ♦ నెంచుచంద్రు
రమణులను గూడుచుండి ♦ శ్రీరంగసీతు
లెన్నియో పల్కుచుండ్రి మ ♦ హినియందు.

స్త్రీచిత్తవృత్తిం దెలియ నెవ్వరికిని దరంబుగాదుగదా. ఈజారిణి విటకాని స్నేహము శాశ్వతంబనితలంచి భర్తను జంపదలంచెనంట. కటకటా! ఎంతదారుణము. [పుత్రిక నుద్దేశించి] హా! పుత్రీ! ప్రభావతీ! ఉభయకులంబులకునుగీర్తి దెచ్చి చంద్రమతీ ద్రౌపదీత్యాది కాంతాశిరోమణులు వోయిన తెరువున బోయికీర్తిగాంచెదవని తలంచితినిగాని యీరీతి దుశ్చారిత్రవై నావంగడంబున కెల్ల నపకీర్తి దెత్తువని దలంపలేదు. సద్గుణంబులులేని పుత్రికలు పుట్టుట కడుపుచేటు గదా. ఇటువంటి పాపాత్మురాలు పుట్టిననేమి గిట్టిననేమి.

వీర—(మేదరిని విలోకించి) తరువాత.

వెంక—ఆజాయినీయమ్మ నాచేతికత్తెట్టికెళ్ళి మంచినిద్దర పోతుండగా మగనిమెడ నరుకుచుండగా ఆ,ఆ,ఆగుఆగు నరకొద్దని కేక వేస్తూ ఒకజోగివాడు అడ్డంకి పెట్టినాడంట. అంతలోకే యీబిడనరికేసిందంట. ఆజాయినడ్డుకొన్న సన్నాసిగాడిని చూసి యీయమ్మభయపడి ఆచేటుపని ఆజోగాడిమీదకి తోసేయాలని రాజభటులరా నామగని నెవ్వడోచంపుసుండాడు బేగేవచ్చిరచ్చించాల అని కేకలేసిందంట బటులాకేకలిని ఆజోగియాతని కట్టుకుపోయినారని నిన్నరేయి యీబిడనాతో సెప్పింది. అంతేకాని నోనోసంగతి యెరుగను బాబు. ఈపాపానికి నాకత్తికూడ సాయపడ్డమాట సత్తెం ఆమీద పబువులసిత్తం ఈదురుమారుగుని యీతాగుబోతుయెదవను మీరేమిసేసినను సేయొచ్చు నాపాణాలు మీకిచ్చేశాను మీచిత్తంబాబు.

పరిభా—(తనలో) ఈమేదరి రహస్యంబంతయు బూసగ్రుచ్చి

నట్లు వచించినాఁడు. ఇంక నేనెంతమాత్రమును మరియొక తీరుఁగఁజెప్పి తప్పించుకొనుటకు మార్గములేదు. ఇందుకునేనొడంబడియే తీరవలయును. అక్కటా! పతులనువంచించి యుపపతులను జేరుటవలన గలిగెడు నష్టము నాకిప్పుడు కదా బోధపడినది.

వీర—(పరిభావతిని జూచి) పరిభావతీ! ఇందులనుగురించినీవేమి వచించెదవు. ఈతుచ్ఛుఁడు పలికినపలుకు లన్నియు నిజమేనా?

పరిభా—(తనలో) ఈతనిపల్కుల కేమిప్రత్యుత్తరంబిత్తు. తలయెత్తి మాటాడగలనా? జీవంబులుదాల్చి భూమిపై బ్రతుకగలనా? (ఏమియు మాటలాడక యూరకొని యుండును.)

వీర—సోదరీ! నిరుత్తరం బంగీకారసూచకంబేకదా.

చిత్రి—(తనయునిజూచి) కుమారా! నేనింక సభాస్థానంబున నుండజాల. ఇందునీయిచ్ఛవచ్చినట్లు విచారించి నేరస్థులను శిక్షింపుము. ఈయధికారము నీకొసంగితి. (నిష్క్రమించును.)

పరిభా—సోదరా! నీవింకనన్ను గ్రుచ్చిగ్రుచ్చి యడుగనేల? సమస్తంబును నీకుదెలిసియేయున్నది. పూర్వజన్మ పాపంబునం జేసి నేనిట్టి కార్యంబునకు దొడంగి నిందపాలయితిని. దోషంబంతయు నాయదెకాని మేదరి దెంతమాత్రమును లేదు. ఇట్టికార్యంబాచరించి కులంబునకెల్ల నపకీర్తి దెచ్చితి. ఇంక నేనీజీవంబుల భరించి ధరాతలంబునఁ దలయెత్తి మెలంగజాల. కావున నాయందుఁ బరిపూర్ణకృపాంతరంగుడవై నీకరవాలంబుచే నాకంఠంబునఱికి పుణ్యముగట్టుకొమ్ము.

వీర—పరిభావతీ! నీభర్తను మోసగించి యుపపతిగూడినందులకు నీకంతశిక్ష విధించునంతటి యవసరముండదుకాని భర్తప్రాణంబులు తీసినందులకుమాత్రము నీప్రాణంబులు దీసిదీరవలయును. నీయందుగలిగిన వాత్సల్యము ను, కూర్మి, ప్రేమయుద్యజించి నీకట్టిశిక్ష విధించుచున్నాఁడ. నీతల్లినిజూడఁ గోరెకకలదేని యొకసారిజూచి నీప్రాణంబులు బాయుటకు సంసిద్ధవై యుండుము.

ప్రభా—సోదరా! ఇట్టియకార్యం బాచరించి నిందపాలయిన నేను నాజనని మొగంబేరీతి జూడగలుగుదు? అయినను నవమాసంబులుమోసి నన్నుఁగని నానాకష్టంబులఁబొంది పెంచిపెద్దదానిగ జేసిన యామెనొకసారి దర్శించివచ్చెద ననుగ్రహింపుము.

వీర—(మేదరినిజూచి) ఓరీ! జయంతవధను గూర్చి ప్రభావతిని బోత్సాహపరచినది నీవేయని మాకుదోచినది. కాని దోషంబుమాత్రము విశేషముగా ప్రభావతియందున్నది. కావున నామెకు మరణశిక్షయు నీకు నీజీవంబులున్నంతవరకును గారాగారనివాసివై యుండునటులను శిక్షవిధించితిని. [రాజభటులంజూచి] రాజభటులారా! ఈప్రభావతిం దోడ్కొని మాజననినిదర్శింపజేసి పిమ్మట కింకరుల కప్పగించి యురితీయింపుడు. ఈమేదరిని గారాగృహనివాసునిగాఁ జేయుఁడు. ఇదేముమ్మాటికి నాయాజ్ఞ.

(12) నాంగు—వెంకడు కాంభోజి ఏకతాళము.

1 సంపుడయ్యానన్నుకూడబాబు । నాకొంపదీసి బందెలోన । కుళ్ళబెట్టబోకుడయ్య ॥సంపుడయ్య॥

2 ఎల్లకాలమిట్టులుండజాల । మీపిల్లనాకుకొంపదీసెచాల । పిల్లలాదిక్కులేదు । యిల్లాలికూతులేదు । యేలాబ్రతుకువాడ । యేలీకపోవుడయ్య ॥సంపుడయ్య॥

3 బుద్ధిలేకపాడుపనిచేసితీ । వేపుద్దులేల మిమ్ముసుఖపెట్టితీ । హద్దుమీరియున్ననన్ను । గుద్దిసంపియేయరయ్య । మొద్దులాటిబ్రతుకదేల భూమిపాలుసూడకయ్య ॥సంపుడయ్య॥

వెంక—(తనలో) ఓరిబాబు పుట్టిమునిగింది. యీపాడుకట్టెలో పాణాలున్నంతకాలం చెరలోయేడవాలంట అయ్యోదేముడా అంతకంటె సావేమేలుగందా (ప్రకాశముగా) మారాజా! కటాచ్చించి నాతలతీయించేయాల నేనీసిచ్చసహింపలేనుబాబు మీవంటిపెబువులు యింతత

క్కువసిచ్చయేస్తారాబాబూ సిచ్చయెచ్చించాలఅన్నా నాకూయిమీా రేలయ్యింటారు. నేచేసినపాపం అనుభవించోద్దాలఅమ్మా పెబావతీయం తపనిచేసినమ్మా కోతివంటికీచిత్తం సిక్కబెట్టలేక తాగుబోతులంజకొడుకును నన్నిగందంలోకిదింపి నాకొంపతీశావు. నీపాణాలు తీసుకుంటు

న్నావు. అయితేయేంలే నాకంటనీవేమేలు యేమంటూవానీకురిసిచ్చయే సారుగనుక కట్టాలుతెలవు. నేనంటేను పాణాలున్నంతకాలం గబ్బిలప్పెంటవాననతో నున్న బందిలో చచ్చినట్టుపడుండాల ఇదంతకేంగాని ముందునాకొంపతీసుకొన్నాను ఓసీయిారిపిల్లా ! నేటితోనీకూనాకూ సరి నీమొగంనాకు కనపడదుకందా ఆనాడునీవెన్ని సెప్పావు మావాళ్లు ఒద్దనుమిాఒద్దనుమిా రాసారిపిల్లసైనేహం ఒద్దనుమిాయని నాకెంతగ డ్డెట్టారే నీమాటయినక యెదవనై కుక్కనై గాడిదనై పందినై పాల

వంటిరాచకులం చెరిచి నాకొంపతీసుకున్నాను. నేనేకాదునావలెమంచి చెడ్డలాలోచించక పోరుగోరె సంసారిపిల్లల కూడినయెదవల అందరిగతి యింతే. యిక్కడ రాచసిచ్చతప్పిననాకుయముడుసిచ్చతప్పదు. కలిసొచ్చిందికందాఅనివోళ్లెరక్క పాడుపని సేయగానేసరా. యిప్పుడునాకొంపకూలిపోయింది నాకత్తిమూలపడింది నాపిల్లలు చిన్నోళ్ళుపనిపాటలు సేయలేరు నాయాలిసత్తులేనిది తడికలల్లునేర్పులేదు ఆళ్ళెట్లుజీవిత్తారో తెలదుగందా ఓలేయిారిపిల్లతిరిపమెత్తైయినా పిల్లలనురచ్చించుకొనుము కాని యీాపెబావతిలాగ తెరవలబరిగి యిపత్తులపాలుకాకుము ఓతల్లులారా! నాలాటినీచోన్నికూడి కామంచేత కన్నులుమూసుగొనిపోయి లంజలై తిరిగి యీాపబావతిలాగకాక మిామానం కాపాడుకొండి. దేవుడా యికనాబారం నీమిాదేశాను ఆపైనినీచిత్తం.

(భటులు సంకెలలు దగిలించి తీసికొనిపోవుచున్నారు.

(13) సాంగు—ప్రభావతి, హామూనాఘూనా అనువరున

1 హా । పాపి । నైతి । నాపతిజంప ॥హాపాపి॥ జారిణినైదు । శ్చారిణినైనం । సాహసముకూలిచి ఘోరముజేసితి (హా॥

2 లాలితరాజకులంబు చెంపితిఁయో । యేల । నాబ్రతు । కేలనాదుజన్మ ॥హాపాపి॥

3 జగతిపతివ్రతా । చరణముతో సాటి । లేదుకదా యెంచలేమలకీయెడ॥ హాపాపి॥

ప్రభా—(స్వగతము) పతిభక్తికి మించినవస్తువీజగంబునలేదను సంగతి నామనంబున నిప్పుడు నాటినది. ఏదియైనను ననుభవంబులోనికివచ్చినగాని తెలియదు. తుచ్ఛసుఖంబునకాసించి మహాదుష్కార్యం బాచరించితి. ఈనామరణంబు లోకంబున సుదతులెవ్వరునునిట్టియకార్యమునేయకుండుటకై యుదాహరణమై యలరారుగాక. అహా ఎంత పాపంబుగట్టుకొంటి భర్తనువధించిలోకనిందపాలైతి, జననీజనకులారా మీరునన్ను బెంచినందుకు సద్గుణంబులుకలదానినై వంశమునకుగీర్తి తేజాలనైతిని. నామూలంబున మీకుఁగూడ నపకీర్తివచ్చినది. నేనెటువంటిదాననైనను మీయందనురాగముమాత్రములేకపోలేదు. నేఁటిదినంబుననే ప్రాణంబుల బాసిపోవుచుంటిని ఇట్టికుమారిక గలిగెననియు నామె మరణదండన విధింపఁబడుటచే జచ్చెననియుమాత్రము మనంబున నుంచుకొనుఁడు. కాంతామణులారా । పురాకృతప్రారబ్ధమునంజేసి నేనిట్టితుచ్ఛమగు దుష్కార్యంబాచరించి యిట్టిపాపంబు గట్టుకొంటి, మీరెల్లరును విద్యావతులై భర్తసేవయే మోక్షప్రదంబనితలంచుచు దుర్గుణంబులను దంజేరనియక పుట్టినింటికి మెట్టినింటికి యశంబుగూర్పుఁడు. నేనుపతివ్రతనుగాకపోయినను నాయనుభవంబునజేసి యిట్టియుపదేశంబిచ్చుచుంటి భర్తసేవవిడనాడి జారిణినై సంచరించినందులకు ఫలం బనుభవించితిని.

వీర—రాజభటులారా ! ఈమెను మాజననికడకుఁగొనిపోయి యామెదర్శనంబుజేయించి మధ్యాహ్నంబున వధ్యభూమికింగొనిపోయి యురిదీయుఁడు.

(రాజభటులు ప్రభావతిని దోడ్కొనిపోవుచున్నారు.)

జయవర్మ—రాజకుమారా ! కాలాతీతమైనది. మనము గృహంబునకుఁబోదమా.

వీర—మంత్రివర్యా ! నీవేగుము. నేనీసన్యాసితోనించుక సంభాషించివచ్చెద.

(జయవర్మ నిష్క్రమించుచున్నాఁడు.)

వీర—సన్యాసివేషధరా ! నీరూపంబుజూడ నీవొకసుక్షత్రియ వంశజుండవని తోఁచుచుండెను నేనిదివఱకే నీతోఁబనియుంటిని. ఇప్పుడైనను మనంబున శంకదక్కి నిజంబు వచింపఁగోరుచున్నాఁడ.

జయపా—రాజకుమారా ! ఆసంగతియంతయు నేనువచింపరాదు. అందులకునన్ను క్షమింపుము. కొండొకకార్యార్థమై యీసన్యాసివేషంబుధరించితిని. పూర్వజన్మంబున నెద్దియో యించుకపాపంబు జేసికొనుటంజేసి కారాగృహమునునుండుయోగము సంభవించినది. నీకృపవలన బంధవిముక్తుఁడనైతిని. ఇంక నాకనుజ్ఞయిచ్చితివేని నేనేగెద.

వీర—ఓయీ ! హితుడా ! లోకంబునన్యాయాన్యాయంబులు గనిపెట్టుట మిగులకష్టముసుమా. ఏమియునెఱుంగని నీకన్యాయముగఁ కారాగృహవాసంబు తటస్థించెనుగదా. అందులకు నీచిత్తంబెంత పరితాపమొందుచున్నదో.

జయపా—అందులకే నెంతమాత్రము జింతించుటలేదు. నా బ్రతుకుమాత్రము చింతలకాకరంబై యున్నది.

వీర—ఏమి; అట్లంటివి ?

జయపా—మరేమియులేదు.

వీర—పోనిమ్ము. దానికేమిగాని నీనిజవర్తమానంబు దెలిపి నన్ను సంతసపెట్టెదవా ?

జయపా—అయ్యా ! అదిమాత్రము చెప్పనందుకు నన్ను క్షమింపుము.

వీర—నీవట్లనుచుండగా నేనేమిచెప్పఁగలను ? నీకెద్దియేని యభీష్టంబుగలదేని జెప్పుము దానిఁదీర్చెద.

జయపా—(స్వగతము) ప్రాణపదంబయినమిత్రుండు గతించినాఁడు. ఇంకనాకేమికావలయును? అతని యస్తికలనైనజూచి సంతసించుచుందును. కావున నవియిప్పింపుమని కోరుదు. (ప్రకాశముగా) రాజనందనా ! నాకేమియునభీష్టంబులేదు. కానిజయంతుని యస్థికలు మాత్రము నాకిప్పింపుము. నాకదియే పదివేలు.

వీర—ఇదియేకదా నీయభీష్టము. అట్లనే యిప్పించెద. ఇఁకనే బోయివచ్చెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

జయపా—(తనలో) లోకంబునగల యంగనలందఱును ప్రభావతివలెనే చరించుచుందురా ! మూఁడువత్సరములనుండి పుట్టినింటకడనే యున్ననాభార్యయు నిట్లుప్రవర్తించుచుండెనుఁగాబోలు. జయంతుని యస్తికలంగొని నాయత్తవారింటికేగి నాభార్యాగుణంబులఁబరీక్షించెదఁగాక. (నిష్క్రమించుచున్నాఁడు)

ఇది తృతీయాంకము.






## చతుర్థాంకము.



### కల్యాణపురము.

### చారుమతి సౌధము.

[ప్రవేశము—చారుమతియు, నర్మదయు]

చారు—చెలీ ! నాకంటెనీవు వయస్సునఁ జిన్నదానవయ్యును భర్తృసేవాపరాయణురాలవగుటంజేసి పతివ్రతాధర్మంబుల నుగ్గడింపుమని కోరితివి. అందుకునా డెందం బెంతయునానందంబందినది; నాకు. తెలిసినంతవఱకుఁ దెల్పెదను. సావధానచిత్తవై యాలింపుము.

(14) సాంగు—చారుమతి కాంభోజి-ఆది

1 పతిభక్తి సాటిలేదుగా ॥ ఓపడతీవసుధాపైని । పరిశీలింపగ। పతి భక్తి సాటి॥
నిరతంబుపతిసేవ । జరియించుసతులాకు । ధరణీదుస్తరకార్యతతి యున్నదే॥పతిభక్తి॥

2 సత్యముగాసూర్యాచంద్రులుదయింపాక । వ్యత్యస్తమూచేయు బల్మిచేకూరు॥పతిభక్తిసా॥

3 ఒక్కపతివ్రత । యుర్వీతలంబెల్ల । జక్కాడచుబ్రోచుశక్తి జెల గు॥ పతిభక్తి॥

తే. గీ. క్రూరుఁడైన జారుండైనఁ ♦ గూళయైన
విటుఁడయైనను మరి యవి ♦ వేకియైన
దరుణి కాత్మనాథుఁడు సుమీ ♦ దైవసముఁడు
వానిసేవయె తలఁప సౌ ♦ భాగ్యమతివ.

పతి యెట్టిదుర్మార్గుఁడైనను నాతనిని దైవంబువలె భజించెడి కాంతనే పతివ్రతారత్నంబని యందురు.

సీ. సకలసౌభాగ్యకా ♦ సారంబునకు రాజ
హంస తలంపగా ♦ నాత్మధవుఁడు
అంచితానంద సౌ ♦ ఖ్యాంబుధి నోలలాడింప
పతికదా పూర్ణశ ♦ శాంకరుండు
సంతాపదావాగ్ని ♦ శాంతింప నిజభర్త
యేకదా ఘనవృష్టి ♦ జేకవాఁడు
సంసారమను మహా ♦ సాగరమ్మున దేల్చు
నౌకకు వరుఁడెకా ♦ నావికుండు
తే. గీ. సకలమంగళములు గూర్పఁ ♦ జాలువాఁడు
దలఁపగా ప్రాణనాథుఁడే ♦ తరుణికెప్పు
డింతవచింపగా నేటి ♦ కెంచిచూడఁ
దోయజాక్షికి భర్తయే ♦ తోడునీడ.

సీ. దరిలేనిదుఃఖాబ్ధి ♦ దరియింపఁజేయఁగా
భర్తసేవయెకద చూ ♦ పట్టునావ
స్వర్గపురాంత ♦ సౌధరాజమునెక్క
రమణసేవయెక ♦ దారాచబాట
సహధర్మచారిణీ ♦ సద్వ్రతమ్మున కెన్న
నాత్మనాథునిసేవ ♦ యాలవాల
మతిపాపసమ దయా ♦ రణ్యము జెక్కంగఁ
గోమలాంగునిసేవ ♦ కులిశధార
తే. గీ. సకలకార్యనిర్వాహక ♦ సాధనంబు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ

యంచితానందమునుగూర్చు ♦ నతివ కెపుడు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ.

పతివసంబెట్లుండునో యదికనుంగొని యాప్రకారము వర్తించుచు హర్గాఢలాలించుచు, నతిథులను బూజించుచుఁగాలంబుగడిపెడి కాంత పతివ్రతయనంబరఁగు. మఱియు సద్గుణంబులు గల వధూటి

తే. గీ. ఉన్నదానికి సంతృప్తి ♦ నొందుచుండు
నెల్లపూజలు సేయుచు ♦ నెగడుచుండు
నఖిల సాధ్విజనైక వ్యా ♦ ద్యానవద్య
సుగుణగణనీయ యగుచుండు ♦ జగతియందు.

తే. గీ. అత్తమామలయందున ♦ బత్తిగలిగి
మఱఁదులయెడ సతతిమున ♦ మక్కరుణఁబూని
భృత్యజనములనెపుడు కో ♦ పింపబోక
ఉభయకులములకు సుకీర్తి ♦ యువిద తెచ్చు.

పరపురుషులు సోదరులుగను, పరులధనంబు తృణంబుగను, బరికించుచుండును. ప్రాణధవుని పదసేవపరాయణురాలు ప్రాణహానికైనను నోర్చుగాని మానహాని కోర్వదు. పతిసేవజేయఁదలంపని నాతికోతిగాని నాతిగాదు. ఒకతృటికాలంబైనను పతినెడబాయక యతఁడెన్ని యిడుమలఁ బడుచున్న నవియెల్లఁ దానును బడుచు యశంబునందవలయును. పతివ్రత భర్తకన్న ముందుగా నిద్రలేచి యతనిపాదంబులకు నమస్కరించి యత్తమామల చిత్తంబుననుసరించి గృహకృత్యంబుల నెల్లదీర్చి స్నానంబాచరించి, చక్కనిచేలంబుధరించి వంటకంబొనర్చి యతిథులం బూజించును.

సర్మ—సఖీ! చారుమతీ! పతి పరదేశవాసుఁడై యుండెనేని సతియేమిజేయవలయును?

చారు—(స్వగతము) ఆహా! ఈమె చక్కనిప్రశ్న యడిగినది.

ఇందుకేమి ప్రత్యుత్తరంబిత్తు. ఈప్రశ్న నాహృదయంబంతయు గలంచినది. చిరకాలంబునుండి నిజపాదాంబుజదర్శనంబీయని నానాథునిజ్ఞప్తికిదెచ్చుచున్నది. (ప్రకాశముగా) నర్మదా! సాధ్యమగునంతవఱకు భార్యయెప్పుడును భర్తనెడబాసియుండరాదు. అట్టిదికటస్థమై నపతివ్రతయగుకాంత యెప్పుడును బుష్పములుముడవక, తాంబూలచర్వణమాచరింపక పతిరాక కెదురుజూచుచు దినంబులు గడపుచుండును.

నర్మ—ప్రియసఖీ! నేడునీనుండి బతివ్రతాధర్మంబుల గనుగొంటి. నాచిత్తంబునకెంతయు నానందము గూర్చితివి. ఇంకనొకటియడుగ దలంచితిని. పతివ్రతయగు కాంత యెప్పుడును స్వబలంబుకంటెదైవబలం బెక్కుడుగనుండునని జనులువచింపుచుందురు. ఇదినిజమేనా?

చారు—అందులకు సందియమేమి? ద్రౌపదీచరిత్రమాలింపలేదా. మున్ను కౌరవులామెను నిండుసభయందు వస్త్రము లొల్చుచుండగా నామె శ్రీకృష్ణుని బ్రార్థింప నతండు కృపాంతరంగుండై రక్షించెనుగదా?

నర్మ—నీవు చెప్పినమాట నిజంబే.

చారు—భర్తనువిడనాడి కాలంబుగడుపు సతిబ్రతుకుబ్రతుకే కాదు. రమణీ! నాయవస్థకు నేనేమని చింతింతు. నాభర్తసందర్శనమాచరించి నేటికిమూడువత్సరంబులైనది, అక్కటా! భర్తను జూడక నేనెన్నిదినంబులిట్లు కాలముగడపగలను? భర్తయేకదా భార్యకుదోడునీడయైయుండును. అట్టిపతి నన్నుజూడక యిన్నివత్సరంబు లున్నయప్పుడునేను జీవించుటవలన ఫలంబేమి? చెలీ! నిజము చెప్పుచుంటిని. ఇంకకొలదిదినములలో నాభర్త నన్నుజూడరాకయున్నచో బ్రాణంబులు బాయుటకు సంసిద్ధనైయుంటి. ఇట్టి బ్రతుకుకంటె జీవంబులు బాయుటయే మంచిదని నాచిత్తంబునందోచినది.

నర్మ—చెలీ! కాలంబెప్పుడును నొక్కరీతిగనుండదు. చీకటులుపోయి వెన్నెలలు వచ్చురీతి దుఃఖములబాసి సౌఖ్యంబులందుదెవం

బులువచ్చును కావున మనంబునఁ జింతపీడియుండుము. నీతో వెనుక నొకయోగిని నీభర్తను కొలఁదిదినంబులలోనే చూడగలవనివక్కాణించియున్నది. మహాత్ములవాక్యంబు లనృతంబులుకావు. నీవు నీభర్తను త్వరలోనె చూడగలవు.

చారు—సఖీ! యెక్కడిమాటలు. ఆయోగినిచెప్పి యనేకదినంబులాయెను. ఇంతవరకు ప్రాణేశ్వరుని జూడనేలేదు. భగవంతుఁడు నానొసట నిట్లువ్రాసియుండగా వేరువిధంబున నేలజరుగును.

నర్మ—చెలియా! చింతింపకుము. భగవంతుఁడునీయెడత్వరలోనే కృపఁజూపనున్నాడు. (ఇంచుకయూరకుండి)చాలప్రొద్దుపోయినది. ఇంక నేగృహంబునకేగెద.

చారు—అట్లనే పోయిరమ్ము (నర్మద నిష్క్రమించుచున్నది.)

చారు—(స్వగతము) అక్కటా! నాయవస్థను నేనేమనిచింతింతు. తోడికాంతలెల్లరును దంభర్తలంగలసి సౌఖ్యంబందుచుండనేనిట్టి దుఃఖంబుననుభవించుచుంటి. వారిమధ్యంబునఁ గూర్చుండుటకే నాకు సిగ్గగుచున్నది. అయ్యో! భగవంతుడు నాబ్రతుకిట్టిదిగాఁజేసెను. ఇట్లగునని కలనైనదలంపనైతిని. భర్త సేవలాచరింపుచు దోడికాంతలెల్లఁ బొగడునట్లు యశంబు నందునని దలంచితినిగాని యిట్లగునని యెన్నఁడును దలంపనైతి. ఇబ్భంగి నింకెంతకాలముగడపుదు?

తే. గీ. దీపతతిగాంచరాని మం ♦ దిరముభాతి
శారికారాజులేని పం ♦ జరముమాడ్కి
భవ్యదైవంబులేని గ్రా ♦ మంబుపగిది
కాదెభర్త చెంగటలేని ♦ కాంతబ్రతుకు.

నన్నుజూచిన కాంతలెల్లరు బరిహాసింపుచుందురు. (ఇంచుకయూరకుండి) హా! మనోహరా! నావలన నేరంబేమి? నిన్నువిడనాడి యీరీతి నిన్నివత్సరంబులుండన్యాయమా! అగ్నిసాక్షిగవివాహంబైన

నాయెడ నింతనిర్దయవహించుటకునావలనదోషంబేమి? నిరంతరమును నీనామమే దైవమంత్రమువలె హృత్పీఠికయందుంచి భజించుచున్ననా యందిప్పుడైనను కృపవహింపవా? ఇన్నివత్సరంబులు విడనాడియుండి నచో నాబ్రతుకేమగునోయని నీకుఁదోచలేదా? అహర్నిశంబులునీపా దసేవనొసంగి నన్ను ధన్యగాఁ జేయుమనినియాసతో నుంటినిగానియీరీ తిజేయుదువని యెన్నఁడును దలపనైతిని. నీయండలేనట్టినాబ్రతుకేల కాంతల కెప్పుడును బతిసేవయేకదా సకల సౌభాగ్యసంపత్ప్రదంబు భార్యను హింసపెట్టుట నీబోటి పుణ్యాత్ములకుదగునా (ఇంచుకయూ రకుండి) హా! దైవమా! నేనీకింత బరువైతినా నిరంతరమునీనామస్మ రణం బాచరించుచున్న నన్నుకరుణతోఁ జూడకుండుట పాడియా నా మనోహరసందర్శన మాచరించునట్లునీవుసేయలేవా? నాయందిట్టి నిర్ద యవహించుటకు నేను నీకేమి లోపంబు గావించితిని. తండ్రీ! గోపాల కృష్ణా! నీవేదిక్కని మొరపెట్టుకొన్నదీనజనంబులననేకుల రక్షించితివి. నామొరాలింప వేమి కారణము?

సీ. కోపమాలేక నా ♦ పాపమా నన్ను సం
తాప పెట్టంగనో ♦ దైవరాయ
ఖేదమానీకేను ♦ వాదమానాతోడ
ఖేదమున్ గూర్పంగ ♦ సాధువంద్య
వాసియా నీకిడ ♦ దోసమా నాయది
యీసున జూడంగ ♦ భాసురాంగ
నేరమానావల్ల ♦ భారమా నేనువి
చారమున్ గూర్పంగ ♦ సదయహృదయ
తే. గీ. యింతవంతను గూర్పంగ ♦ స్వాంతమందు
దలఁపుఁ బూనుట గనుమంచి ♦ గాతలంప
బ్రోవవే యిపుడైన సం ♦ పూర్ణకృపను
పరమ కరుణా స్వభావ ♦ గోపాలదేవ.

అయ్యో! నాసంతాప ముఁలేనిన్ను వేడికొనుటలయ్యెకాని 'నీకు కృపలేనట్లుండెట్టు నాయందు దయఁజూనుమువు, అదియుంగాక బ్రహ్మ నానొసట నిట్లువ్రాసినాఁడు. అది యనుభవింపక నాకుఁదప్పునా! దానినిదప్పించుట కెవ్వరికైనను దరంబగునా! (యించుక యూరకుండి) వెనుక నొకయోగిని నాకడకువచ్చి చింతించుచున్న నన్నుఁ గాంచి ‹రమణీ! నీవు నీభర్త రాకకై యెదురుచూచును జింతించుచుంటివి. నీమనంబుననున్న కోరిక దివ్యదృష్టిని నేగనుగొంటి నీభర్తసందర్శనంబు త్వరలోనే చేయఁగలవు! నీకు శుభంబు లొనఁగూడు" నని వచించెను. ఆహా! ఆయోగిని పల్కులుకూడ మిథ్యయయ్యెను కదా! ఆమెవచించి యిప్పటికి వత్సరంబైనది. ఇంతవఱకును నాతని జూడనే లేదు. నేనింక నెన్నాళ్ళుండఁగలను, (ఇష్టదేవతయగు కాళీదేవి నుద్దేశించి) తల్లీ, దుర్గామహాదేవీ! నిన్ను నాయిలువేల్పుగాఁ బూజించుచుంటిని నాయందు నీవు కరుణవహింపవైతివిగదా. ఓతల్లీ! భగవతీ వేయేటికి, నీవు నాయందుఁగరుణఁబూని నన్నునాభర్త సందర్శనమాచరించునట్లు చేయకపోతివేని నేను బ్రాణంబులు బాయుట నిజంబు. ఇదే ముమ్మాటికిని బ్రతిజ్ఞచేయుచున్నాను.

(అంతనేపథ్యమున) భక్తురాలా! చారుమతీ! నీభర్త యిప్పటికింక మూఁడుదినంబులలో నరుదెంచును. నామాటనమ్మును. నీభక్తికి సంతసించితిని. నీకుడిహస్తంబుతో విగతజీవులను స్పృశించితివేని సజీవులగుదురు. ఈవరంబు నీకొసంగితిని. మనంబునఁజింతదక్కియుండుము.

చారు—ఆహా! ఏమినాభాగ్యము. భగవతి నాయందుఁబ్రసన్నమైనది. నాకు వరంబుగూడ నొసంగెను. నేఁడుకదా నాకానందమబ్బినది. ఇంకనేను జింతవీడి మనోహర పాదసందర్శనంబున కెదురుచూచుచుందు. (నిష్క్రమించుచున్నది)

ఇది చతుర్థాంకము.

---



# సంగీతజయంతజయపాలము



పంచమాంకము.

——:o:——

చారుమతి సౌధము.

(చారుమతి—జయపాలుడు ప్రవేశము.)

(15) పాట—చారుమతి కేదారిరాగము-రూపకము.)

2 ధన్యురాలనైతినిమీదు । దర్శనమున ప్రాణనాథ । మాన్యచరిత
నినుగంటిని । మానితనైతి॥ధన్యురాల॥

2 ఆ యుమాకటాక్షవిభవ । మందితి సుఖములజెందితి । మాయురే
మిముకనులగంటి మహిని వెలసితి॥ధన్య॥

3 చిరతపంబుజేసియుంటి । వరదర్శనముగంటిని । సిరులగంటిసౌభా
గ్యము । జెందియుంటిని॥ధన్య॥

చారు—సీ ఇదికదా సుదినంబు ♦ తుదిలేనినా చిత్త
సంతాపమెల్లను ♦ సమసిపోయె
నిదికదాసుదినంబు ♦ మదిరాక్షులందున
వెలలేనికీర్తితో ♦ మెలగగంటి
నిదికదా సుదినంబు ♦ మదనారిపాదముల్
భజియించినందుకు ♦ ఫలముగంటి
నిదికదా సుదినంబు ♦ మదనసుందరమూర్తి
వౌనినుగాంచు ♦ భాగ్యంబుగంటి

తే. గీ. నేమి చెప్పుదు నాభాగ్య ♦ మిప్పు డనీకు
వేచియున్నందులకు నిన్నుఁ ♦ జూచినాను
ధన్యనైతిని నీపాద ♦ దర్శనమునఁ
గలరె ననుబోలుపుణ్యులు ♦ క్ష్మాతలమున.

మనోహరా! భవదీయముఖారవిందసందర్శనంబునంజేసినాకెంతయో యానందము గలిగినది. మీపాదదర్శనం బాచరించి నేటికిమూడువత్సరంబులైనది. పుట్టినింటికడ కాంత నిన్నాళ్ళుంచుటకు మీమనం బెట్లుసమ్మతించె. మిమ్మువిడనాడిన నాటినుండియు దిన మొక యుగముగాఁగడపుచు మిమ్ములనెప్పుడుచూతునాయనివేచియుంటిని. నన్నీరీతివిడనాడి యుండుట మీకు న్యాయమనితోఁచెనా, సద్గుణంబులుగల పడతికిఁ బతిపదాంబుజసేవకంటె నితరంబు లేదుకదా, మీరు నేఁడో రేపటో రాకయుండినఁ బ్రాణంబులఁ బాయుటకు సంసిద్ధనైయుంటినిఁ

తే. గీ. కాంచఁగల్గితి మీరూపు ♦ గఱవుదీర
జేయఁగానోఁచినాను మీ ♦ సేవ కాంత
లందున సుకీర్తిఁబొందంగ ♦ నలరినాను
కలరె ననుబోలుధన్యలు ♦ క్ష్మాతలమున.

జయపా—రమణీ! ఎరుగుదువుగదా మారాజకుమారుండగు జయంతుని! అతనికి నాకును అతిమైత్రి

తే. గీ. మఱవగాఁ జేయఁజాలను ♦ భాగ్యభోగ్య
ములను; కాంతపైనుండెము ♦ భూరిప్రేమ
తల్లిదండ్రుల; దలఁపగా ♦ ధరణియందు
స్నేహమెంతయుఁ జాలదు ♦ నీరజాక్షి

శా. ఆమిత్రుండును నేను సుంఘసుఖ ♦ వ్యాపార మేపారఁగా
భూమిన్ సంతతముఙ జరిగింపుచు మా ♦ పూర్వోన్నపై నుండు ప

త్రైవమున్ వీడితిమేమి చెప్పఁగలనో ♦ బింబోష్ఠిరో యిప్పుడా
హా! మిత్రుం డుగతించె; నన్నిటుల చిం ♦ తాంబోధిలోముంచెనూ

తన్వీమణీ! నాకును జయంతునకు నున్న మిత్రిత్వము వర్ణించు
టకు శేషునకైనను దరంబుగాదు. పండిన నొక శయ్యాతలంబునందే
పండవలెను. భుజించిన నొక్కకంచముననే భుజింపవలెను. ఒక్కత్రుటి
కాలంబైనను మేమెన్నడును బాసియెఱుంగము. మామిత్రత్వమునకు
భంగము కలుగజేయవలెనని యెందఱో యెన్నియో ప్రియత్నము
లాచరించి తుదకు వ్యర్థప్రియత్నులైరి.

మ. ధరణీపాలుని పుత్రునింగలసి మో ♦ దంబార భూమిన్ నిరం
తరమున్ గాలముబుచ్చుచుంటి; నకటా ♦ తస్వాంగిరోయిప్పుడా
వరమిత్రుండు గతించుటన్ నినుగనం ♦ భావించెయే తెంచితిన్
సరసీజానన నాదునేరము గృపన్ ♦ సైరింపుమీ వేఁడెదన్.

చారు—నాథా! మీరింతమాట పలుకఁ జెల్లునా? మీపాద
సేవకు రాలను గదా.

జయ—తే. గీ. ఎన్నినాళ్ళాయెను కదా ♦ యింతినిన్ను
గాంచి ; యాత్మకానందంబు ♦ గలిగెనాకు
నిన్ను వీక్షించుటం జేసి ♦ నీరజాక్షీ
తప్పుసైరింప వేఁడగాఁ ♦ దగదొనిన్ను.

రమణీ! పుట్టినింటికడ నివాళ్లు నిన్నుంచి దుఃఖములపాలు జేసి
న పాపుండ. నాకై యెంతయారాటం బందితివో కదా.

చారు—నేనందిన యారాటంబంతయు మీముఖసందర్శనం
బున నడుగంటె. మీపాదసేవ సేయుభాగ్యంబు నేటికి లభించినది. అది
యేనా కానందము. (యించుక యూరకుండి) నాథా! దీనికేమిగాని,
మీకుఁ బరమమిత్రుండగు జయంతుని యకాలమరణంబునకుఁ గార
ణం బడుగవచ్చునా ?

జయపా—ఆకారణ చెప్పదగదు. ఈకలికాలంబున నావిధాత.

తే. గీ. మూల్గుచునుమూలగూర్చుండు ♦ ముసలివాండ్రి
పెక్కువత్సరంబులిల జీ ♦ వింపజేయు
సుందరాంగుల గూడి యా ♦ నందము దు
యౌవనాంగుల కిడుచుండు ♦ నకటచావు.

మఱియు తే. గీ. బిడ్డలను డబ్బుకాసించి ♦ విక్రయించు
వారు ; జారునిపొందుకై ♦ పతులజంపు
వారు ; జన్మంబునంది యు ♦ న్నారు జగతి
కట్ట ! యేమిచెప్పుదు కలి ♦ కాల మహిమ.

చారు—(తనలో) నాధుండు చెప్పిన రెండు వాక్యములందు విశేషార్థంబు స్ఫురించుచున్నది. ఈయన యిట్లు వచించుట కేమి కారణమోకదా. (ప్రకాశముగా) మనోహరా ! మీరుచెప్పిన రెండవ వాక్యంబునఁగల యర్థంబు నాకుఁ దెలియుటలేదు.

జయపా—తరుణీ ! అందు విశేషార్థమేమియును లేదు. ఇక్కలికాలంబున నట్టి కాంతులుండిరని చెప్పితిని.

చారు—ప్రపంచంబునందు గలవారందరును నట్టివారనియేనా మీయభిప్రాయము; లేకసద్గుణంబులుగలవధూటులుకూడగలరనియా!

జయపా—సద్గుణంబులు గలవా రరుదని నాయభిప్రాయము. (ఇంచుక యూరకుండి) సతీమణీ, అప్రసంగమంతయునిప్పుడేల ? మార్గాయాసంబున డస్సియుంటిని. కావున నిప్పుడు శయనించి బడలికవాపుకొందును. (శయ్యపైఁబరుండి) మరచితిని. ఈమంచముక్రిందనుంచిన మూట నంటకుమీ (అని నిద్రపోవుచున్నాడు)

చారు—(స్వగతము) మనోహరుఁడు వచ్చుటంజేసి నామనం బెంత సంతోషమయంబైనది. భర్తకు సేవజేయుభాగ్యంబు నేటికి లభించినదికదా. (ఇంచుక యూరకుండి) నాధునికి నిద్రపట్టినది. ఈమంచ

ముక్రిందనున్న మూట ముట్టవలదని నానాధుడు వచించె. ఇందేమి యున్నదోకదా. మూటవిప్పిచూతునా. అట్లాచరించితినేని నాథునాజ్ఞ నుల్లఘించినదాన నగుదు. అట్లుగాదు. నాథుండు నాకొరకేదియో తె చ్చియుండి పరిహాసంబున కట్లు పలికయుండును. కావున చూచెదను. (అని మంచముక్రిందనున్న మూటను విప్పిచూచి) ఏమిదీ! ఆశ్చర్యము గనున్నది. అస్థికలమూట నేటికిదెచ్చెనోకదా నాథుండు; నాకొరకేది యోతెచ్చెనని యాసపడితిని. తుదకివి యస్థికలయ్యెను. కానిమ్ము. ఇదియెప్పటివలెనే మూటగట్టి పరుండెదను. (అని యట్లుచేయుచున్నది.

మంచముక్రిందనుండి జయంతుఁడు లేచుచున్నాడు)

జయం—(కోపముతో) పంచచామరము.

భయంబులేక నీవునాదు ♦ భార్యగూడి యిట్టులన్
శయ్యాతలంబునుందు నిప్పు ♦ సంతసంబు జెందుచున్
సయంబటంచు నెంచి పండి ♦ నావె దుర్మదాంధమూ
రయంబునన్ ఖరాసిచేత ♦ ప్రాణమూడఁదీసెదన్.

ఓరీ ! మిత్రద్రోహీ; ఎంతకార్యం బాచరించితివిరా ! నాస్నేహ మువలదని నిన్నుద్రోసివుచ్చినను సిగ్గులేక నావెంటవచ్చి యిట్టిద్రోహ కార్యంబాచరించితివా. నిన్నునమ్మి నేనెంత మోసపోయితిని. బాల్యం బాదిగ నావెంట జరించుచుండ గపటంబెఱుంగనివాడవని తలంచితిని గాని యిట్లెన్నఁడు దలంపనైతినిగదా! నీదుర్వర్తనంబంతయు మొన్న వేశ్యతో సంభాషించినప్పుడె తెలిసినది. ఓరీ! దుష్కర్మా! నీకామము దీర్చుకొనుటకు స్నేహితునిభార్యయే కావలసివచ్చెనా. ఔరా ! ఎంత పనిగావించితివి. ఓరీ! పాపాత్మ! పరాంగనలను రమించుట కేనాబ్రహ్మ సృష్టించినది. ఇట్టికార్యం బాచరించుట పాపంబనినైనను నీమదికిఁ దోఁచలేదా ; ఆవేశ్యను నేనుగోరినప్పుడు పరాంగనను గూడుట పాపం బని నీవు నాకెన్నియో బుద్ధులుగఱపితివి. నీనీతులు కాలిపోయినవా; అవును. మోహాంధకారంబున మునిఁగియున్న నీకునీతులు దోఁచునా;

(ఆలోచించి) ఇట్టియకార్యంబాచరించిన యీపాపాత్ముని మదీయకర వాలంబున ఖండించి కృతార్థుఁడనయ్యెద. (అనిజయపాలుని కంఠంబు నఱికి చారుమతింజూచి) హా! యంతకార్యమాచరించితిని (నలుదిక్కులుచూచి) ఇదియంతయు మాయగఁదోచుచున్నది. ఈకాంత నా భార్యకాదే. ఈమందిరము మాయత్తవారిదికాదు. (చచ్చినజయపాలునిజూచి) హా! జయపాలా! మిత్రశేఖరా!

(16) సాంగు—జయంతుడు-ఫీలురాగము-రూపకము

1 చంపితినా మతిలేక । సఖా॥ చంపితినా॥
యోచనసేయక । యుగ్రముదాచితి॥ చంపితినా మతి॥

2 నాసతియనుకొని । మోసముజెందితి । వాసిగకోపము పట్టగజాలక ॥ చంపితినా॥

3 ప్రాణసఖుని నీదుప్రాణముగొసితి । దీనుడనైతిని తెలివినిదొరగితి॥ చంపితినా॥

తే. గీ. నాదుభార్య పజ్జనుజేరె ♦ నావటంచు
కఱకుగత్తినిగంఠంబు ♦ నఱికెనాఁడ
కట్ట! మితిలేనిపాపంబు ♦ గట్టుకొంటి
నిందు కేమంచు జింతింతు ♦ డెందమందు.

అయ్యో! కోపంబుచే నొడలు తెలియకనిన్నీరీతిగాజేసితికదా; ఎంతపాపంబుగట్టుకొంటి. సఖుఁడా; నిన్ను జిన్నతనంబునుండియునాతో

తే. గీ. స్నేహమొనరించునట్టులు ♦ జేసినాఁడ
నెంచలేనిభాతిని సంచ ♦ రించినాఁడ
నీవె నాప్రాణమంచును ♦ నెంచినాఁడ
పాపినై నీదు ప్రాణంబు ♦ బాపినాఁడ.

నీకుమిత్రుండనై నిరంతరమును నీతోజరించుచు సంతసంబున గాలంబుగడుపుచు తుదకు నీప్రాణంబులుగూడ బాపితినిగదా. నీవంటి

మిత్రుండు నాకు వేయిసంవత్సరంబులు తపం బాచరించినను దొర
కునా. అక్కటా! చేతులారఁ జంపుకొంటిని. (ఇంచుకయాలోచించి)
ఆహా! యీమందిరంబునకు నేనెట్లువచ్చితినోకదా. ఈమె వీక్షింపగా
జయపాలుని భార్యవలెనే దోచుచున్నది. ఇప్పుడు నేనేమిసేయుదును!
హా! భగవానుడా! నాచేత నెట్టిదుష్కార్యం బాచరింపజేసితివి. (పరి
కించి) అదిగో! ఆమె నిద్రనుండి లేచుచున్నది. (భయము నభినయిం
చుచున్నాఁడు)

చారు—(నిద్రలేచి) మార్గాయాసంబున డస్సియుండుటచే నా
థుండింకను నిద్రించుచునే యున్నవాఁడు. (అతనిపరికించి) హా! ఏమిది;
ఇరువురము గలసి శయనించియుండి, నేనుమాత్రము నిద్రలేచునప్పటి
కీతనికంఠము నఱకఁబడియుండెను. అయ్యో! నావ్రాత కేమని వగతు.
పెక్కువత్సరంబులనుండి నిజపాదదర్శనంబీయని మనోహరుండరుదెంచి
ఇంక నాతని సేవజేసి కృతార్థురాల నగుదునని తలపోయుచు సంత
సించుచుండగా నాకిట్టియవస్థరాజెల్లునే. మనోహరా! మీకోమలశరీర
ము నెట్టిగతిలోజూడవలసివచ్చెను. నిర్భాగ్యురాలనగు నాతోగూఁడి
యుండుట కిచ్చలేక దివం బలకరించితిరా. నాకునిద్రరాకున్నచో నిం
తముప్పు వాటిల్లకుండునేమోకదా. ఒకదినంబైనను మీపాదసేవ జేసి
యెఱుంగనుకదా. పాపాత్మురాలనగు నాకాభాగ్యముకూడలభించునా.
(ఇంచుకయూరకుండి) అక్కటా; కంఠమునఱకఁబడియుండుట కేమికా
రణమోకదా. ఏదుర్మార్గుండీసౌధంబు బ్రవేశించి యిట్టిఘోరకృత్యం
బాచరించెనో యెఱుంగరాదు. (ప్రక్కదిరిగి జయంతునిజూచి) ఓరీ!
దురాత్మా! నీవెవ్వఁడవురా! అర్థరాత్రంబున నాసౌధంబుజొచ్చి నిద
రించుచున్న మన్నాథునికంఠంబు నఱకితివి. దుర్మతీ! నీకిట్టియకార్యం
బాచరించుటకు చేతులెట్లాడెనురా! నామనోహరుఁడు నీకేమియుపకా
రం బాచరించెను. ఎంతనిర్భీతితో నంతఃపురము జొచ్చితివి.

జయం——(భయము నభినయించుచు) కాంతాశిరోమణీ! నేనే మిచెప్పుటకును నోరాడకున్నది. నీనాథునకు నే నత్యంతసఖుండ. నా యభిదానంబు జయంతుఁ డందురు. నేను మాయత్తవారింట భార్యా సహితుఁడనై నిద్రజెందితిని. ఇక్కడమేల్కాంటిని. ఆమాయయేమియో నాకు దెలియరాదు. ఇపుడు నేనునాసఖుండునన్ను వంచించి నాభార్య పజ్జనుశేరినాడనితలంచి, కోపావేశంబున నొడలు తెలికయ యిట్టియకా ర్యం బాచరించితిని. నన్ను నీవేశిక్షవిధింపఁజేసినను సంసిద్ధుడనై యుం టి. నీకుభర్తశోకంబుదెచ్చిన యీకఠినాత్ముని కరవాలంబుచే గుత్తుక నటికి పుణ్యము గట్టుకొమ్ము.

చారు——ఓయీ ! రాజకుమారా ! నీవు మారాజకుమారుం డవే ; నాప్రాణేశుని కనుంగు సఖుండవనికూడ దెలియును. కాని, నా మనోహరుండు నీవుగతించితివని వచించినావు. గతించినవాఁడవు తిరిగి యెట్లు వచ్చితివి?

జయం——సోదరీమణీ ! నేనెరింగినంతవరకు నిజంబు బల్కెద మాయత్తవారింట నిద్రించితిని. ఇచ్చట మేల్కాంటి.

చారు——(తనలో) ఇదియాశ్చర్యముగ నేయున్నది. (ఆలోచించి) ఇందుకునేనాలోచింపనేల. కాళీమహాదేవి 'నాయందుఁ గృపాంతరంగ యైమరణించినవారిపై నాకుడిహస్తంబుమోపినచో సజీవులగుదురనివ రంబిచ్చెనుగదా, ఆవరప్రభావంబున నానాధునిజీవింపఁజేసెద. (ప్రకా శముగా) రాజనందనా ! నీవు చింతిపడకుము; నీకుమిత్రుఁడును, నాకు ప్రాణేశ్వరుఁడు నగునితనిని దృటిలో జీవింపఁజేసెదను. (అని తన కుడి హస్తముచే జయపాలుని స్పృశించుచున్నది.)

[అంతట జయపాలుఁడు లేచుచున్నాఁడు.

జయపా——(కన్నులు నులిమికొనుచు) రమణీ! నిద్రనుండినన్ను మేల్కొలిపితివేల? [జయంతుని విలోకించి] ఏమిది ! ఆశ్చర్యముగను

న్నదే! ఓయీ జయంతా! మరణించిన నీవు భూతంబవై వచ్చితివా?

జయం—నా చేవధింపబడిన నీవును నట్లేవచ్చితివా?

జయపా—(తనలో) ఇదివింతగానున్నది. మరణించినయీతను మరల నెట్లుబ్రతికెనోకదా, నాకు భీతికలుగుచున్నది.

జయపా—మిత్రమా! ఏమి యాలోచించుచుంటివి. నేను నీ సఖుండనగు జయంతుడనే (అని సమీపించుచున్నాడు.)

జయపా—నీవు భూతమువలెఁ దోచుచున్నావు. నన్ను సమీపింపకుము. చచ్చిపోయిననీవు మరల నెట్లువచ్చితివి?

జయం—నేను చావలేదు. నాచే నీపిప్పాను చంపబడి మరల నీభార్యా ప్రభావంబునంజేసి బ్రతికితివి.

జయపా—(తనలో) ఈసంగతి నాభార్యనే గనుఁగొందు (చారుమతిని విలోకించి) రమణీ! ఏమది? ఇదియంతయు నాకద్భుతంబుగఁ దోచుచున్నది.

చారు—మనోహరా! మీరు నిద్రజెందుసమయంబున మంచముక్రిందబెట్టిన మూటనంటవలదని వచించితిరి- కాని నేనూరకుండక నాకేమి తెచ్చితిరోయను నాసచే దానినివిప్పి యందస్థికలుజూచి, మరల నెప్పటివలెనుంచినిద్రబోతిని. పిదప నీజయంతుఁ డెట్టులోవచ్చిమీకంఠంబు నఱికి చింతించుచునిలుబడియుండ నేను మేల్కాని యాతనిం గాంచి మిమ్ముగలజంపుటకు గారణం బడిగితిని. అందుల కాతను తన భార్యపజ్జను మీరుపరుండిరను తలంపున నట్లుచేసితినని చెప్పెను. అంతట నేను నాకు గాళీమహాదేవి యిచ్చిన వరప్రభావంబున మిమ్ము బ్రతికించితిని. ఆతండును నట్టులేబ్రతికెనని నానమ్మకము.

జయపా—(తనలో) ఏమి! నాతరుణిప్రభావము. (ప్రకాశముగ)

శా. నీమూలంబున జూడగల్గితిని నా ♦ నెయ్యుంపు మిత్రోత్తమున్
భామా! చచ్చినయట్టిమమ్ముబ్రతికిం ♦ పంజేసి నావీవహో

# ఆంధ్రనాటకములు.

——————):o:(——————

| నాటకము | రూ. | అ. |
|---|---|---|
| వేణీసంహారము. వ. సు. | 1 | 0 |
| కంఠాభరణము పా. ల. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకం, ,, | 1 | 0 |
| రాధాకృష్ణ, ,, | 0 | 10 |
| సారంగధర ,, | 0 | 9 |
| మణిమాల. నృ. ఆ. | 0 | 10 |
| విచిత్రబిల్హణీయము | 0 | 8 |
| శాకుంతల. కం వీ. | 0 | 12 |
| కనకతార. చ. కే. | 1 | 4 |
| కుశలవ. వి. సు. | 0 | 12 |
| సారంగధర. | 0 | 12 |
| కృష్ణలీల. వ. కె, సు. | 1 | 4 |
| లవకుశ | 1 | 4 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 4 |
| సుభద్రార్జునీయము | 0 | 12 |
| పాండవవిజయము. తి. వె. | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము. బ. ల. | 1 | 4 |
| సత్రాజిత్తీయము. | 1 | 0 |
| ఉత్తరరాఘవము. | 1 | 4 |
| బుద్ధిమతీవిలాసము | 1 | 0 |
| రోషనార. | 1 | 0 |
| చింతామణి. కా. నా. | 1 | 0 |
| వరవిక్రయము. కా. నా. | 1 | 0 |
| రంగరాయకదనసమవాకారము (బొబ్బిలి) కా. నా. | 1 | 0 |
| పద్మవ్యూహము. | 1 | 0 |
| మధుసేవ. ,, | 1 | 0 |
| కన్యకాపరమేశ్వరీవిలాసం | 1 | 0 |
| సుగుణమణి. వ. బా. | 0 | 10 |
| పాల్ ఆఫ్ విజయనగరం | 0 | 1 0 |
| తులసిదాసు. | 1 | 0 |
| రామదాసు. | 1 | 0 |
| చిత్రనళీయము. ధ. కృ | 1 | 4 |
| విషాదసారంగధర ,, | 1 | 5 |
| పాదుకాపట్టాభిషేకం,, | 1 | 3 |
| పాంచాలీస్వయంవరం,, | 1 | 0 |
| మోహినీరుక్మాంగద ,, | 1 | 0 |
| చంద్రహాస ,, | 1 | 0 |
| బృహన్నల. ,, | 1 | 0 |
| ప్రహ్లాద. ,, | 1 | 0 |
| ముక్తావళి. ,, | 1 | 0 |
| చిరకారి. ,, | 1 | 0 |
| శ్రీరామాంజనేయము. | 0 | 10 |
| శ్రీకృష్ణసందేశము. | 0 | 12 |
| బొబ్బిలియుద్ధం. శ్రీ. కృ | 1 | 0 |
| శ్రీరామజననము. | 0 | 8 |

| | |
|---|---|
| శ్రీరామప్రవాసము. | 0 8 |
| శ్రీరామఉద్యోగము. | 0 8 |
| శ్రీరామవిజయము | 0 8 |
| శ్రీరామఅశ్వమేధము. | 0 8 |
| 1 గయోపాఖ్యానము చిల. | 0 8 |
| 2 ప్రసన్నయాదవము ,, | 0 8 |
| 3 పారిజాతాపహరణము ,, | 0 8 |
| పైమూడు పుస్తకములు క్యాలికో బైండు | 1 12 |
| సంగీతసత్యవిజయమను హరిశ్చంద్ర చ. మా. | 1 0 |
| సంగీతసావిత్రి. ,, | 1 0 |
| సంగీతప్రహ్లాద ,, | 0 12 |
| భూలోకరంభ ,, | 1 0 |
| స్త్రీసాహసము. ,, | 0 10 |
| చంద్రకాంత. | 0 10 |
| లంకాదహనము | 0 12 |
| శ్రీకృష్ణరాయవిజయము,, | 0 12 |
| సంగీతశశిరేఖ. | 0 8 |
| సంగీతజయంతజయపాల. | 0 8 |
| సంగీతసారంగధర. | 0 8 |
| పంచుగెకట్టము ప్రబంధము | 0 8 |

భోగరాజు, నారాయణమూర్తిగారు.

| | |
|---|---|
| పాండవఅజ్ఞాతవాసం | 0 8 |
| ఉషాపరిణయము. | 0 8 |
| హస్తినాపురం. | 0 8 |
| చతురచంద్రహాస. | 0 8 |
| ద్రౌపదీపరిణయము. | 0 12 |
| విజయబొబ్బిలి. | 0 12 |
| శ్రీకృష్ణతులాభారము. | 0 12 |
| ఆంధ్రపతాకము. | 12 0 |
| గులేబకావళి. అ. ను. | 1 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయము. | 0 10 |
| శ్రీకృష్ణవిలాసము. | 0 10 |
| ప్రతిజ్ఞాయాదవము. | 0 10 |
| గర్వభంగము. | 0 10 |
| సంగీతసైంధవార్జునీయము | 0 8 |
| సంగీతపాశుపతార్జునీయము | 0 8 |
| పాదుకాపట్టాభిషేకము. | 0 12 |
| సీతాకళ్యాణము. | 0 8 |
| తులసీదాసు క్రొత్తది. | 1 0 |
| లోకాభిరామాయణము. | 0 6 |
| సంపూర్ణరామాయణము. | 1 0 |

కర్రా అచ్చయ్య అండు సన్సు,
బుక్కుసెల్లర్సు
రాజమండ్రి.

శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాల:—రాజమండ్రి. 1927.